౧౯౧౦-౩౯ సంవత్సరముల నడుమ శారద, భారతి, ఆంధ్ర సారస్వత సర్వస్వము, ఆంధ్ర-సంచిక, కృష్ణా-సంచిక, గోలకొండ-సంచిక, మహతి, ఆంధ్రి, ప్రజామిత్రలు ఈ పద్యములలో కొన్నింటిని ప్రకటించెను. ఇందుల కీ పత్రికాధిపతులకు నేను కృతజ్ఞుఁడను.

ఇపు డా పద్యములను సంస్కరించియు కొన్ని క్రొత్తపద్యములను జేర్చియు సహృదయులకు ఏకావళి యొనర్చితిని.

## ఏ మి టి ?

ఈ జగంబు సర్వ మేమిటి యేమిటి ?
యేమి యీ జగం బి దెల్ల నెల్ల ?
ఎవ్వరేని యిందు నెఱిఁగినవా రున్నఁ
జిత్తగించి నాకుఁ జెప్పరన్న.

ఇలనుండి యింత దవ్వుల నింత దవ్వుల
నాకాశ మం దేల యలరినావు
కాఁకయు వెలుఁగు తూకముగాఁగ సరిపోవు
పోల్కి నీ వం దేల పొల్చినావు
ఆఱు మాసము లట్టు లాఱుమాసము లిట్టు
లేల ఛందోలీల నేఁగుచుందు
వీగోళమే కాక యింకెన్ని గోళముల్
కాపాడ నీ కేరి కట్టడి యిది

ఏల పొడిచెద వే లస్త్రమింతు వోయి
వేఁడి వేలుప ! తెలియ దీ వింత నాకు
దివికి నెవ్వాఁడొ యెత్తిన దివ్వె వాక్కొ
ఒప్పొ తప్పొ యిదెవ్వారు చెప్పువారు ?

ఆకాశంబున నూరకే చనెదవేలా కొంచె మిం దాఁగు నీ
వే కార్యంబు తలంచి పోయెదవు ? నీ కేవార లీ సుందరం
బాకారంబు వెలుంగు నిచ్చి యిఁకఁ బొమ్మం చాన కావించిరో
నాకుం దెల్పుము నేఁడు నీ కథను జంద్రా! విందు నాద్యంతమున్.

ఓ జలరాశి! యే లిటుల
        నూఁగుచునుండెద వో ధరిత్రి! నీ
పైఁ జరణద్వయం బునుచు
        వారముగాని నినున్ గ్రహింపఁగా
నోజను బొంద మోపృథుశి
        లోచ్చయసంతతులార! మీర లే
నేఁజెల రాలొ? మే మొ? మఱి
        నిల్చియుఁ బల్కను నోరు పొల్చియున్.

తనదు గర్భంబునందులఁ దనరుచుండి
యెదుగు పిల్లను దల్లి తా నెఱుఁగఁబోదు
తనను గర్భంబునందులఁ దాల్చుచున్న
తల్లి నిసుమంత యెఱుఁగదు దానిపిల్ల.

పాములు తేళ్లు జెఱ్ఱులును
వ్యాఘ్రములున్ మఱి యేదుఁబందులుం
జీమలు దోమలాదులగు
జీవము లెందుల కుండె? నుండెఁ బో
యేమవి పీడ గూర్పవలె
నేమి? యిదేమి విధంబు? తెల్పు నా
స్వామి సమన్వయింతుఱ్ఱు మది
పండితు లర్థము కాదు నా కొగిన్.

ఇది కారణ మది కారణ
మిది యదియును గాదు వేఱు హేతువు మావా
రెదొ వచియించిరి నాకున్
వదలదు మది శంక చెప్పుఁడు వాస్తవ మయ్యా!

ఈ జగంబు సర్వమేమిటి యేమిటి?
యేమి యీ జగం బిదెల్ల నెల్ల?
ఎవ్వరేని యిందు నెఱిఁగినవా రున్నఁ
జిత్తగించి నాకుఁ జెప్పరన్న.

ప్రమోదూత — చైత్ర

# నా యావశ్యకములు

నా కొక్క తోఁట యొక్క త
టాకం బొక కొండ యొక్క యడవియు మేలౌ
నేకాంతం బేఱును నివి
కా కొక నాకయును దప్పకయ కావలయుఁ.

కొండ నా తండ్రి, తోఁట నా కూర్చు తల్లి,
యడవి మిత్రంబు, వాఁగు పిన్నమ్మ, చెఱువు
వావిఁ జెల్లెలు, నావ నా వాహనంబు,
అల్ల యేకాంతమో యంతరంగసఖుఁడు.

ఏ యొకరుండు లేని యొక
        యేటి సమీపతలంబునం దర
ణ్యాయతనంబునందును ద
        టాక తటంబునయందుఁ దోఁటయం

దాయతశ్శైల శృంగమున
యందు జనించు మహావనీజమం
దూయెల యొందు నాసనము
నొందును దప్పక నాకుఁ గావలెన్.

అందు నిర్మల భావనోద్యానమందుఁ
గూరుచుండి యథేచ్ఛముగా రచింతు
ఛందమునకును యతికిఁ బ్రాసంబునకును
నవల నలరారు రసచారు కవిత మమత.

౧౦-౫-౧౪.

## ఆంధ్రుఁడా!

చదివెద వింగిలీ సది విసర్జన చేయు మటంచు నే ననన్
జదివెదు సంస్కృతం బదియుఁ జాలు నటంచును బల్క నీవాగిన్
వదిలితి మాతృభాష యిది పాడియె? యంచును జేతు లొగ్గి నీ
యెదుటను నిల్చి వేఁడెదను నించుక చెప్పు జవాబు నాంధ్రుఁడా!

ఒక్క భాష కాదు తక్కిన భాషల
నన్నిఁగూడ నేర్వు మయ్య యాంధ్ర!
నీదు మాతృభాష నిఖిల పుష్పరసమ్ము -
చేతఁ దేనెపెరను జేయుమయ్య!

పర నర పాల సేవలకుఁ బొల్పడ కన్యుల భాష నేర్వ కి!
త్తఱి మనపొట్ట నిండమియె తథ్యము కాని తెలుంగు బాసనున్
మఱచితివేని నీదయిన నాలుక పాయక పాయసాన్నముల్
మఱిమఱియారగించుటకుమాత్రమెపాత్రమునమ్ముమాంధ్రుఁడా

ఆంధ్రుఁడా!

తెలివికి సంస్కృతమున్ మఱి
కలిమికి నాంగ్లేయమో యిఁకం దురకంబో
విలువ యిడి నేర్చి యీ నీ
తెలుఁ గెవ్వరి పాలు చేసి తిరిగెద వాంధ్రా!

వాక్కుండియును మాతృభాష రాకుండుచోఁ
గడు మాటలేల ? మూకుఁడవు సుమ్ము
వినఁ గల్గియును నీదు విమల భారతి వినఁ
బడయవేనియు బధిరుఁడవు సుమ్ము
చూడఁగల్గియు నీదు శుభసరస్వతిఁ జూడ
దొరఁకొనవేని యంధుఁడవు సుమ్ము
దేశ్యుండవేని నీ దేశభాషను నేర్వ
కుండుచో నన్య దేశ్యుఁడవు సుమ్ము

నడువఁ గల్గియు నీ తెల్గు నాడు నెల్ల
నడువకుండిన యెడలఁ బంగుఁడవు సుమ్ము
మతి నొసంగియు నీ దేశమాతయందుఁ
జూడ్కి లేదేని పిచ్చివి సుమ్ము యాంధ్ర!

ఏ కా వ ళి

అన్న ప్రాశము హోటలందున స్వవి
        ద్యాభ్యాసముల్ కాలెజీ
తిన్నెం బేరిమి దేశసేవయును
        బస్తీలందు నా ఫీసు లం
దన్నన్నా ! మన చిన్నవారలకు దు
        ష్టావస్థ యిట్లాయె నీ
యన్నాయంబున కూరకుండఁ గల వ
        య్యా! యాంధ్ర దేశీయుఁడా!

౨-౧-౨౩.

# కుక్కపిల్ల

౧

ఇండ్లు దొడ్లు లోని వెల్లయు గాలించి
కుక్క యొకటి దాలిగుంట తనకుఁ
దగిన దంచు లోన తలపోసినదియు కాఁ
బోలు నందుఁ బురుడు పోసికొనియె.

శ్రీరమణీయమౌ తనువు సింగపుమోమును నూర్ధ్వపుండ్ర మే
పారెడు చండ్ర నిప్పుకల యట్టి కనుల్ పులిచాఱ లేపులౌ
గోరులు కల్గు దానిచిఱుకూనను గాంచుచుఁ బెద్ద లెల్లరున్
భైరవమూర్తి యంచు నొక నామము పెట్టిరి మంచిరోజునన్.

అలకుక్క కూన నచ్చటఁ
దిలకించిన యంతనంత దేవా! నీ విం
దుల నెలకొంటి వటంచును
గలయఁగ ననుకొంటి హృదయ కమలము నందున్.

పది దినాలలోనె బలిసి యల్ల కబోది
జ్ఞాన నేత్ర మార కరఁగి కరఁగి
కరఁగి రెండు కనులుగాఁ బరిణామంబు
చెందె నొక్క వేఱుచేవతోడ.

కన్నులు లేనినాఁడు తను గాంచిన తల్లి సుధాఘటంబుగాఁ
గ్రన్నన జ్ఞాననేత్రి మది కన్నులు కాఁ, దనకన్నఁబెద్దదై
యున్నటువంటి జంతు వనియున్ శునకార్భక మెంచె జ్ఞాన మీ
కన్నులుగాఁగ మాఱినను గల్గఁగఁబోలును నిట్టి భేదముల్.

వావిచపొంటెఁ గానఁబడు వస్తువులన్నియు నాకు నేల మీ
చూచును గోళులుండుటకుఁ జొప్పని త్రివ్వను దల్లి పొట్టలో
దాఁచిన యిల్లదున్నదని తాఁ గనఁబోలును దూఱుఁ; దల్లి పో
లేచిన జంటి నంటికొని లీనమగున్ శునకార్భకం బహో!

ఆఁకలి మైనప్పు డాకాశమును మ్రింగ
నెంచఁ బోలును మోర నెత్తుఁ బైకి
ఎవరేని దాపుగా నేతేరఁగా మీదు
దాసుఁడ ననఁగఁ బాదంబు పట్టు
మహినిఁ గారాకులు మరమర లాడంగ
సింగంబు వోలె గర్జించు నెగసి
ఆదివరాహంబు నాపోసనముఁ గొనఁ
దలఁపఁ బోలును నేలఁ ద్రివ్వ గోళ్ళ

ఆఱఁ గట్టిన వలువల యంచు కఱచి
క్రిందఁ బడి మీఁదఁ బడి తలక్రిందులగుచు
మాటిమాటికినిం జెఱి లాటలాడు
నక్కజము పిక్కటిల్ల నా కుక్కపిల్ల.

దానినిఁ గాంచి చాల సరదా పడి ప్రేముడితోడఁ బెంచగాఁ
బూని గళంబునన్ నిగళముం దగిలింపఁగఁ గోరి బస్తికిన్
నేనొగిఁ బోయినప్పుడు గణించుచునుఁ గొనితెచ్చి మెల్ల నా
కూనమెడం గడంక నెలకొల్ప నొకించుక దాని డాసితిన్.

తన స్వాతంత్ర్యము పాడుచేయు ననుచున్ దా సుంతయేనిన్ మనం
బునయందున్ శునకార్భకం బెఱుఁగఁగాఁ బోకల్లనన్ శృంఖలన్
దినుబండారమునాఁగ భావననొ జాతి స్వస్వభావాననో
కొను లాగున్ విదిలించు గీఱు నములుం గొంపోవు నట్టిట్టులన్.

'అసలు శరీరమేయొక మహానిగళంబగు నందుమీఁద నా
యసనిగళంబు కొండొకటియా మన భైరవమూర్తి'కంచు మా
నసముననుం దలంచి 'యయినన్ మెడయందుఁ దగుల్తమెట్టులన్
మసలునొ చూత'మంచు మది మాఱుదుఁ గట్టితి దాని నెమ్మెడన్

కట్టిన యుత్తరక్షణ మె
గాదిగఁ జూచి నఖాళి శృంఖలా
పట్టికఁ బట్టి లాగి నఖ
పాళిక దానను జిక్కఁగోఁగ న
ట్టిట్టగుచుం గుయోమొరో క
యీఁ. కుయిఁ. మంచును నేడ్చె నక్కటా!
కట్టినవాని చేతులకె
కట్టి కనుం గొనఁ బోలుఁ దద్వ్యథల్.

ఆదికిరాతుండు వేద కుర్కురములఁ
గట్టినాఁడా యొక్క గడ్డిపోఁచ?
వటుకనాథుం డాత్మవాహనంబే యగుఁ
గాక యెన్నండేని గట్టినాఁడె?
కట్టఁగా లేదొకో గళనిగళము లేక
యల్ల దత్తాత్రేయుఁడను మహర్షి
గొలుసును గట్టె నొక్కొ మహాప్రస్థాన
దశయందుఁ గుక్కకు ధర్మరాజు?

కట్టఁ గావలెఁ గాక త్రికాల శాశ్వ
తానురాగంబుచేతను గానినాఁడు
ఆఁగఁగాఁగలవొక్కొ యొక్కహామయేని
బధ్యమానంబులున్ మఱి బంధనములు.

౨

పూనిన కూర్మిఁ బిల్లలకుఁ బ్రొద్దున లేచినతోఁ దలంటఁగా
నూనియ రాచి మే యినికి నున్నఁగ నొప్పఁగ వానిఁ ద్రిప్పు నాఁ
గా నొక పంది నూతనముగాఁ బ్రసవించిన సంతుతోడ నా
కూన సమీపమందులను గుమ్మరె దంటమగండు జంటగన్.

అల్ల వరాహయూథమునయందుల నందము లీనుచున్న యా పిల్లలఁ గాంచి చాపలము పెచ్చువగా నలకుక్కపిల్ల తా నల్లన ముందుకాలొకటి యాలకు నోలకుఁ జాఁపిచాఁపి యా పిల్లలలోన తాను నొక పిల్లగనై చనియెం దటాలునన్.

మన పెద్దల్ తొలినుండి వైరములతో మన్నారుగా కీపయిన్ మనమూ వైరముమాటనున్ మఱచుచున్ మైత్రిన్ విడంబించి యి మ్మును జేకొందము' నా వరాహశిశువుల్ మున్ముంద యాకుక్కపి ల్లను మూచూచుచు దీర్ఘఘుర్ఘురసమాలాపంబు చేసెన్ వెసన్

అల్ల కుక్కపిల్ల యలపందిపిల్లల
కూడి కపుడు చాలఁ జూడనాయె
అలలు లోనె లోనె యణఁగి పోయిన యంత -
రాత్మ శబల విభవ మట్టువోలె.

'నిన్ననేఁగాక మొన్ననె జనించిన వీ పసికూన లేమెఱుం గు న్నిజ మాంస సౌరభము క్రోలినచో భషకార్భకం బొగిన్ మన్నిని గూడఁ గ్రోలకయ మానునొకో'యని పందితల్లి తా వెన్నను ద్రిప్పి ముట్టెజడి పించుచుఁ బిల్లలఁ బాయఁ జేయుచున్.

ఆతఱిఁ జాతురి జాత
వాత్రిమము మూచూచుచున్న బైరవమూర్తిన్
భీతిలఁగాఁ బొడిచిన దల
జాతి విరోధంబు తాను సామాన్యంబే?

సూకరి పొడిచిన యంతట
సూకరముం బొడిచె నల్లశునకార్భకమా
తాఁకులచే దేహగృహ
ప్రాకారం బపుడె విడిచి పఱచెం గట్టా !

పొడిచిన తావునం దలఁతివుండును గాని మఱేమి చిహ్నముం
బడఁగను లేదు పట్టుమని బాధయులేదు వికారరూప మె
క్కడయును లేదు మేను కసుగందదు నిద్దపు నిద్ర జెందు న
వ్వడువునఁ గుక్కపిల్ల యిలపానుపునం గనుపట్టె నాయెడన్.

అక్కరణిన్ జయంబు తన కబ్బిన మోదము పెల్లుచేతనో
యెక్కడఁ గుక్కతల్లి కడునేడ్తెఱ వచ్చునో యన్న భీతినో
యక్కడ నొక్కఁడో నిముసమైనను నిల్వక యల్లపంది నల్
దిక్కులు చూచుచుం జనియెఁ దిన్నగఁ బిల్లలు వెంబడింపఁగన్

## 3

కాకిం బోలెను ధర్మపిండమును దాఁగైకోఁగ నాడాడకున్
రాకల్ పోకలు చేయుచుండి నడుమన్ స్వాంతంబొగిం గూనపై
దూఁకం దోడనె చేఁపురా మొగమునందుం బ్రేమ పుష్పింపఁగన్
వీఁకన్ వచ్చెను దల్లి; నాదు కనులన్ నీరుబ్బి వచ్చెన్ వడిన్

ఏకాలంబును బెంగఁబెట్టుకొని తన్నీక్షించినంతం బయిన్
దూఁకన్ వచ్చెడి కూన కానితటిలోఁ దొంగుండెనేలా యటం
చేకాలోచనతోఁ బెనంగొను ముఖం బిట్టట్టులున్ వంచుచుం
దోఁకాడించుచు నిల్చె నాహృదయముం దోడ్తోడనిల్పెన్ రహిన్.

ఆమెయిఁ గొంత సేపరిగి
నంతట నయ్యది పిల్చు రీతిగా
బౌమనె, మేలుకొల్పఁ దన
పాదము జాఁపుచుఁ గూనకాలిపైఁ
బ్రామెను, నంతకున్ మెలకు
వం గయికొమ్మని నేటవాలుగా
మోమును వంచెఁ జూచె నటు
మో మిటు మోమయి కొంతసే పొగిన్.

ఆకల్లోలత నేకరీతిఁ గను నా కాకూన వృత్తాంతమున్
సాకల్యంబుగఁ జెప్పి దానివెతలో సంగోరుపా లొందఁగా
నాకాంక్షించితిఁగాని యక్కటకటా! హాదైవమా! దుర్విధీ!
నాకా కుక్కల భాష కొంచె మయినన్ రాదేమి నేఁజేయుదున్?

మ్రోలన్ నిల్చిన తల్లి దాపరిగియున్ మూచూచిమూ చూఁచితాఁ
గాలుం గాలును ముక్కు ముక్కు నిఁక నింకం గన్నుఁగన్నక్కటా
కీలుంగీలు పరీక్షచేసి మిగులన్ ఖేదంబు నాదంబునం
దోలాడంగను వేగ మింటి మొగమై యుద్రిక్తమై యేడిచెన్.

అలకుక్క యేడ్పు సృష్టి
ప్రళయంబుల నట్టనడిమి భాగమునందున్
నిలువంబడి మృత్యుదేవత
సలయంబుగఁ బాడు పాటచాడ్పున నొప్పెన్.

తెచ్చినవాఁడను దేనే
తెచ్చితిఁ దొలుదొల్తఁ గొంత తిరికాసదికా
వచ్చును మెడలో గొలుసున్
గ్రుచ్చుకపోయితిని మృతినిఁ గూర్చితి నకటా !

‘ఇంకను నాకు నీగొలుసదేలొకో ! దీనినిఁ జూచుచుండఁగా
జంకగు’ నంచునెంచి, పయిఁ ‘జాలును జాలును లేనిపోని దుః
ఖాంకము దెచ్చికొంటిఁ గట ! యంతము లెంతటి వారికేనియున్
బొంకగునే!’ యటంచు నొక బోధమునొందితి నంతలోపలన్.

కుక్కకు నట్టి బోధ మొనఁగూడక పోయెను బాధువడ్డ యా
చక్కని యింటి నెట్లయినఁ జాఁది నిటారుగ నిల్వఁ బెట్టఁగా
నక్కలిఁబట్టి మెత్తుఁ;బడినంతట గుండెలు క్రుళ్ళిపోవఁగా
నక్కట యేడ్చు; నాఁపుకొననౌనొకో యేరికిఁ బుత్రశోకముల్.

ఈనిన క్రొత్తనాళులను నేయితరంబగు జంతువేనియుం
గానకుఁ గీడు చేయు నను కొంకున నాఁకటి బాధసైతమున్
లోనసె మ్రింగి రక్షణమునుం బచరించెడు తల్లి యక్కటా
యానిమిషాననే శుకమహాముని యయ్యెడినే తలంపఁగన్.

అలకుక్క యేడుపులు విని
పులుఁగులునున్ బంధుకులము పోలిక వెతచే
నెలుఁగు పడ నేడ్చెనో యన
నలబలముగఁగూసె సంజ యందుల నంతన్.

సూర్యుఁ డపరాబ్ధి యందులఁ జొచ్చినంత
గొడ్లఁ గాచెడు కుఱ్ఱండు కుక్కకూన-
కాల్లఁ గైకొని దూర భాగంబులందుఁ
బాఱవైచెను దల్లి తాఁ బనవుచున్న.

౪

కూన య దేడ నున్నది యొకో పసి పట్టగఁ బోలుఁ దల్లి; య
ద్దాని నలుంగకుండఁగను దా నెటో కైకొని వచ్చి కొంత దూ
రానఁ బరుండఁ బెట్టుకొని ప్రాణముపోసెడు చూపు చూచు; నే
మానవుఁడేని దానికిని మంచిగ వ్యాఖ్య యొనర్పలేఁ డెటుల్.

నేనుగూడను నప్పు డద్దాని కనులు
చీల్చుకొని వచ్చుచున్న యీక్షితములకును
నన్నలో తమ్ములో కాని యగు కటాక్ష
ములను బరఁగించి కనుఁగొంటి మోము వంచి.

దానిచూపునను నిద్దంపు సంజీవనౌ
        షధిరసం బది యుండఁ జాలు నహహా
పడియున్న యల కుక్క పసికూన వెంటుక్రికల్
        జేనకోలందిగా లేచి నట్లు
ఊర్పు నిట్టూర్పుల యునికిచే నిఱుపక్రిక్క
        లలవోకఁ గ్రిమ్మఱ నాడినట్లు
అఱమోడ్పు కందోయి యల్ల నల్లన విచ్చి
        కనునట్లు నాకును గానిపించె

వెనుక కాళ్ళను విదిలించి వెన్ను విఱిచి
లేచి యిఁకఁ దల్లిమూతి మూచూచు నంచుఁ
దలఁచి సంతోష మెంతయుఁ దల్లడింపఁ
బలికితిని 'కూన బ్రతికెరా బ్రతికె' నంచు.

నా సంభాషణ మాలకించుచును జెంతం బొల్చువా రౌర నీ
కీ సంభ్రాంతి యిదేల ? చచ్చినది తా నెందేని జీవించునే ?
యీ సంపత్తియుఁ గూడ నిల్వ దిఁకఁ జుమ్మీ! క్రుళ్ళి కాకాళికిన్
గ్రాసంబౌ మఱి పూతిగంధియయి వీఁకన్ ముక్కు మూయించెడిన్

అని పల్కి రంత నాకున్
మనమునఁ దజ్జీవితాశ మాయం బాయెం
గనుపట్టె నదియుఁ దత్క్షణ
ముననే యొక ప్రాఁతశవము పోలికి నకటా !

మే మాడు మాట లర్థము
కామినో యయియున్ నిజంబు కాఁబోదని యో
యా మాతమాత్రి మరయుట
తా మానఁగ లేదు నిశ్చితంబగు ప్రేమన్.

విచ్చిన కన్ను లెంతయును విచ్చినయట్టులె చూచిచూచి మే
మెచ్చటివార మచ్చటికి నేఁగఁగ గోడ్లను గాచువాఁ డటుల్
వచ్చియుఁ గూనకాలిఁ గోని లాగుచు రక్కసరుప్పలోనికిం
బుచ్చెను దానితల్లి వినుమోరయి బిట్టు మొఱింగె నత్తఱిన్.

ఏకాంతంబునఁ గుక్కయేడ్పు విను నాకీరీతిఁ దోఁచెం గటా
లోకుల్ పల్కిన మాట పట్టుకోని నే లోలుండనై చచ్చెనం
చాక్రందించితిఁగాని తల్లివలె నే నత్యంత విశ్వాసముం
జేకోఁ గల్గితినేని యాక్షణమ తా జీవించి నన్నాకదే ?

నాఁటి నుండియు నెంతయు నేఁటివఱకు
రక్కసల రుప్పలందులఁ గుక్కమొఱుఁగు
లోకు లందఱకును మఱి కాకపోవుఁ -
గాక నాకును వినఁబట్టఁగాఁ దోడంగు.

౫-౧-౧౮.

# మాతృహృదయము

చెలికయి నందనందనుఁడు చిప్పున నందనమేఁగి తావులన్
బలసిన పారిజాత కుసుమంబులఁ దెచ్చిన యట్లు నే నిదే
కలనగ లన్నియుం గలిపి కానుక దెచ్చితి వచ్చి వెంటనే
తలుపులు దీయవే వడిగఁ దల్పులు తీయవె జీవితేశ్వరీ !

నిలిచి యుగాలు దాఁటినవి నిల్చిన ద్వార మెడారి యైన దీ
కల నగ లన్నియుం గలిసి కావడి బర్వయి పోయె గోడ చా
టల యొక జన్మచాటు పలు కాడమి శూన్యసముద్రమక్కటా!
తలుపులు తీయవే వడిగఁ దల్పులు తీయవె జీవితేశ్వరీ!

అని యిటు శంకరుం డనెడు నాతఁ డొకం డల వారకామినీ
జన మణియైన హేమలత సౌధము ముందర నంగలార్పఁగా
విని విని దాని తల్లి వెనువీథిని వెల్వడి వచ్చి 'మీరయా
పెనుబరు విద్ది మీరసలె పిట్టమనుష్యుల రిట్టు లిం డయా' !

అనుచిటు వేశ్యమాత కడునంజలి
యొగ్గిన శంకరుండు తె
చ్చిన నగ లన్నియిచ్చి 'విను చెప్పెద
నొక్కటి నీకొమార్తెకై
మునుకొని మూఁడులోకములు
మోసెదఁగాని క్షణార్ధమేనియుఁ
మొనసి తిలార్ధమేనియును
మోయఁగఁజాలను దద్వియోగముల్.

అనవుడు వేశ్యమాత బదులాడకముందె తదీయపుత్రి యి
ట్లనియెను 'వాని తెచ్చిన మహాభరణంబులు వానికిమ్ము పొ
మ్మనుము క్షణార్ధమేనియును నయ్యెడ నిల్వఁగ వద్దువద్దు పొ
మ్మను మిఁక నాకు నాతనికి నంతియ యంతియ యమ్మతల్లిరో!'

పటువుగ నిట్లు హేమలత పల్కిన యంతట దానితల్లి య
వ్విటుఁగని 'మీకు నెంతయును బ్రేముడి వర్ధిలుఁగాత'మంచు న
క్కటికము సూపి వచ్చిన ప్రకారముగాఁ జనె నంతమాత్రలోఁ
గటకటలాడె హేమలత గ్రాలెడు సౌధపురః కవాటముల్.

'వచ్చితి వేమొగంబునను వాకిటిలోనికి? నీవు తొల్లి నా
కిచ్చిన బాస యేడ? నిపుడీ వొనరించిన చేత యేడ? నీ
హెచ్చరికేడ? హేమలత యీ హృదయంబును గోరుకొన్న చో
నచ్చగ నీదుతల్లి హృదయమ్మును దేవయ లేక పోవయా'!

చెలికయి నందనందనుఁడు చివ్వన నందనమేఁగి తావులన్
బలసిన పారిజాతకుసుమంబులు మాత్రమె తేరలేదు చే
వలఁతిగ దుంపఁగూడఁ గొనివచ్చె నెఱుంగవె? నాదు డెందమే
వలసినఁ దల్లి డెందమును బాయక తేవయ లేక పోవయా!

మారునితోడు మీనగలు మాకును వద్దిది ప్రేమదాసి నాఁ
బేరిది; హేమదాసియను పేరిది గాదు మఱాకు నింతకుం
బేరు ప్రతిష్ఠ లుండవలె భేషనఁ గావలె నాదు గుండెలం
గోరుదువేని నీ జననిగుండెలఁ దేవయ లేక పోవయా!

ఈరహిఁ బల్కి హేమలత హేమగలంతిక నొందు దెచ్చి ప
న్నీరము గ్రుమ్మరించి యిది నీయమ గుండెలు దెచ్చితేని ప
న్నీ రనుకొమ్ము కానియెడ నిందుగఁ బొర్లిన ప్రేమదాసి క
న్నీ రనుకొమ్మటంచు నతినిష్ఠురతన్ వడిమూసెఁ దల్పులన్.

వారలతాంగి శంకరునిపై కిని సూటిగ ధారబట్టు ప
న్నీ రది వానినిం దడిపి నేలపయిం బడుఁగాయె దానిలో
జాఱిన దీపకాంతులకు శంకరునీడలు కానఁబట్టెఁ ద
ద్ద్వారము ముందు నొప్పుకొని దండనమస్కృతి చేయునట్టులన్.

తడిసి ముప్పందుమై శంకరుఁడు గృహాన
కరిగి తజ్జననీ హృదయాంబుజంబు
కోసికొని వచ్చునంతలోఁ గుముదినీ వి
శేష్వరుండగు చంద్రుఁ డత్తరి చూచె

రాసిరియా ధృతిం బరశురాముని మించుచుఁ బ్రేమదాసి కా
దాసుఁడు వీఁడె వచ్చె నిదె తల్లి హృదంబుజముం బుటుక్కునం
గోసి, కవాటముల్ తెఱచి కొ మ్మని శంకరుఁడన్నయంత సే
బాసని యల్ల హేమలత వాకిలి తీసె విలాస వైఖరిన్.

వాయుజవంబుతో నతఁడు వాకిలి దాఁటఁగ నున్నయంత ని
ష్ఠాయుత యాఁచు హేమలత డగ్గఱి నంత వెసం గుమారుకేల్
బోయిఁ జెలంగు గుండియలు తుళ్లుచు నిట్లనె 'నీ ళ్లు నీళ్లోగిం
బోయితి వేని జాఱిపడిపోదువు మెల్లఁగఁ బొమ్ము నాయనా!'

౨౫-౧౧-౩౫

# దేవాలయ పరివేశము

౧

ద్రావిడ సీమలోని మధురానగ రాంతరమందులన్ మహా
దేవుని యుత్సవంబు లవి దృశ్యములై విలసిల్లుచున్ మహీ
దేవులుఁ బిమ్మటన్ మనుజదేవులు నూరుజు లౌలఁ బాదజుల్
ప్రోవులుగాఁగ వచ్చుచును బోవుచుఁ బోవుచువచ్చు చుండఁగన్.

నల్లని మోముపైఁ దెల్లని భస్మంబు
        మూఁడు బంతుల నిద్దముగను దీర్చి
కంఠకూపము నిండి కనిపించు రీతిగా
        నొంటరి రుద్రాక్ష నంటఁ గట్టి
చిలుక రెక్కల రంగు గలుగు ప్రాఁత బనాతు
        కుట్టిన యొక పెద్ద గోఁచిపెట్టి
మొలత్రాట నొక కొన్ని మువ్వలు గీలించి
        చేత ముమ్మొన వాలు చిక్కఁబట్టి

మాలఁ డొక్కఁడు శివభక్తి మండితుండు
గుడి ప్రహారి గోడ కెంతయు నెడముగాఁగ
ద్వారమున కెట్టెదుట నిల్చి ధ్యానముద్ర
నొందు గైకొని యుపరరుద్రుం డనంగ.

పట్టనము నుండి గుడికి
ప్పట్టున గుడి నుండి యల్ల పట్టనమునకున్
నెట్టనఁ జను జననది కొక
గుట్టాయెను నిల్వఁబడిన గోసంగి యటన్.

ఆదారిం బూజారి మ
హాదేవుని యర్చ కరుగు చాతనిఁ గని 'యీ
రాదారి నుండి లేరా
ఖేద మొదవెఁ బ్రజకు నీదు క్రియ'నని పలికెన్.

పలుకది మాలని చెవిలో
పల దూఱమి నర్చకుండు బలుకోపముతో
నెలుఁగెత్తి తొలఁగు మనఁగా
నల మాలఁడు కన్నులెత్తి యర్చకుఁ గనుచున్.

కుక్కలు చూడవచ్చు నలక్రోఁతులు చేతులు సాఁచి భక్తిమై
మ్రొక్కఁగవచ్చుఁ జీమలును ముంగిట సాఁగిలఁ బాఱవచ్చు నల్
పక్కల నీఁగలున్ ముసరవచ్చునుగాని మనుష్య కోటిలో
నొక్కఁడనయ్యు నే నిచట నుండఁగ రాదుగదా సదాశివా!

కాలొక యింత యూఁదికొని
గట్టిగ మార్గముమీఁద నిల్వఁగా
వీలది మాకు లేదు పృథివీస్థలి
నెల్లెడ నిట్టులైనచో
నాలయ గర్భసీమ దఱియంజని
యచ్చట విశ్వనాథు నీ
మాలఁడు చూడఁగాఁగలుగు
మాత్రపువాఁడె యటంచు మ్రొక్కెనన్.

రెండేండ్లు తపము సేయుము
చండాలా ! ఖండపరశు సన్నిధిలో నీ
కుండుం బ్రవేశ మను చు
ద్దండుఁడు పూజారి దారి తలఁగుచుఁ జనియెఁ.

౨

అటుపిమ్మటఁ బటురయమున
చిటుకు పొటుకు మనక యల్ల శివభాగవతుం
డటవికిఁ జనియెం బూజరి
కటుహాస్యమె తన కవశ్య కరణీయ మనన్.

దినములు దాఁటె మాసములు తేలికగాఁ జనె నొక్క వత్సరం
బును మఱియొక్క వత్సరము వోయెను గ్రమ్మఱఁ బత్తనంబునం
దునఁ గల యెల్లవారల కుతూహల మెచ్చెను నాదిదంపతి
ప్రణయము వీనులార వినభక్తిమెయిం గనులారఁ గాంచఁగన్.

దేవాలయోపరిస్థిత హేమకుంభంబు
        సూర్య బింబమువోలెఁ జూడ నొప్పె
గోపుర ప్రాకార కుడ్యముల్ దూరస్థ
        లకును గన్నుల విందులను నొనర్చె
ఆకాశమున మారుతాక్రాంతమై గాలి
        పట మనంగను బురోధ్వజ మెసంగె
కాలకంధగ వృషగ్రైవేయ ఘంటికా
        ఘణ ఘణాత్కారముల్ కడలఁ బర్వె

రాకపోకలు కలిగె నారాజహాఠి
కమ్మ, గుడి బాలురకు స్వగేహమ్మ యాయె
మూలవిగ్రహ మది యొక్క మూల నుండ
నుత్సవపు విగ్రహంబులే యూరఁ దిరిగె.

గుడి వెలువడి యింటికిఁ బో
యెడి పూజరి కల్ల జాతిహీనుఁడు కంటం
బడె నతఁడు కానఁ బడుటయె
తడవుగఁ దా నన్నమాట తలఁపునఁ బడియెన్.

ఏ కా వ లి

మూలని మోమునందు నణుమాత్రము భస్మము లేదు చేతిలో
శూలము లేదు గట్టి కటిసూత్రమునందున లేవు మువ్వ లా
భాలతలంబు నానఖము వాని శరీరమునం దతీంద్రియ
జ్వాలల ఖేల యొండె కనఁబట్టెను బూజరికిన్ స్ఫుటంబుగన్

ఈరీతిం గని తొంటిమాట మదిలో నేపారి పూజారి 'యో
రోరీ మాలఁడ! నీవు కానఁబడి యొండో రెండో యేండ్లాయె నీ
వీ రెండేండ్లు తపంబు చేసితి వె? నీ వీ దేవ సాన్నిధ్యమున్
గోరన్ వచ్చితివే' యటంచుఁ బలుకన్ గోసంగి తానిట్లనెన్.

'అప్పుడు నా కా కోరిక
తప్పక తా నున్నమాట తథ్యము కానీ
యిప్పుడు నా కా కోరిక
చప్పగ నశియించె నయ్య సారాభిజ్ఞా!'

# ప ద ము లు

పదముల మేము మీరు మము
వాడుచు నుందురుగాని మాదు న
భ్యుదయము సృష్టికిం బరమొ
పూర్వమొ మీ రొకనాఁడు నేనియుఁ
మదులఁ దలంచియున్నటులు
మాకుఁ గనంబడలేదు మమ్ములన్
బడిఁబడిఁ బండితోత్తములు
భావనచేయుఁడు తత్త్వదృష్టితోఁ.

పరమేశ్వరునకు శక్తికిఁ
బురాతనపు వేళఁ బెండ్లి ముచ్చట యగు న
త్తఱిఁ బుట్టిన యర్థముతో
సరాసరిగ మాకుఁగూడ జన్మం బొదవెన్

కవి తన్మయతోన్మత్తుం
డవు పుణ్యపు ఘటికలందు నత్యుత్సాహో
త్సవమును జవమును గైకొని
దివిపై కెగురుదుము మేము దివ్యుల పోలెన్.

అపుడు మే మింత బరువని యరయఁ బోము
దారమునయందు నాణిముత్యాల వోలె
నతుకుకొని యుందు మెందు మే మర్థమందు
మమ్ముఁబోలు పతివ్రతామణులు లేరు.

చల్లని వేళ సత్కవి విశాలమనంబునయందుఁ బుట్టి సం
ఫుల్లత నొందు హల్లకముపోల్కి నొకళ్ళ మొకళ్ళ మోలిమై
నల్లన మేము విచ్చుచునె యర్థముతోడ రసంబు నందులన్
మెల్లఁ గరంగిపోయెదము మేలని మెచ్చెద రప్డు పండితుల్.

అల్ల రాసక్రీడయం దేము మే నెఱుం
గము మాకు నపు డది కలుగఁబోదు
మా వల్లభుని మేము మా హస్తములతోడఁ
బెనవైచికొని యుందు మనుచు నెఱుఁగ
మాతండు తాఁగూడ నా చందమున మమ్ము
నెనయు నటంచు మే మెఱుఁగ లేము
ఆతండు మేమును నల్లల్ల నొక్కళ్ళ
మయిపోదు మొక హృదయంబుతోడ

అపుడు కొందఱు మముఁగాంచి యర్థ మందుర్
అపుడు కొందఱు రసమటం చందుర్ మమ్ము
ఇంక మీరందఱుం గూడ నేమి యేని
చెప్పు కొనుఁడయ్య యాలకించెదము మేము.

ఈ యెడ శాకటాయనులు నెందఱు పాణిను లెంద ఱల్ల కా
త్యాయను లెందఱెందఱు పతంజలు లెందఱు వ్యాడి వామనుల్
పోయిరొ! యెంతమందియిఁకఁ బోదురొ యన్న యట్చిన్న యాదుటా
రా! యొకమాఱు మేము పదమాన్చి పదంబును నెత్తులోపలన్.

వర వైయాకరణులు మా
విరాజి సగుణ స్వరూప వివిధాకారం
బెఱుఁగుదురు కాని వైయా
కరణ ఖనూచుల్ గ్రహింపఁగాఁ గలరొక్కో?

అల్ల వైయాకరణశిల్పి యరసి యరసి
మమ్ముఁ జిత్రించు శిష్టాళి సమ్మదముగ
మేము మా మానమున లేచి మెల్ల నూర్తు
మపుడు చిత్తరు వది తుదలందుఁ జెఱుగు.

మఱలన్ మా చిత్తరువునఁ
జెఱిగిన భాగములఁ బూర్తి చేయఁగ వైయా
కరణుండు వచ్చు నీదెసఁ
దిరుగును చక్రంబు సకల దిగ్దేశములన్.

వాఁడుండెనే వాఁడు వానిపై రదియేమొ
యరసికుం డంచును ననఁగవచ్చు
వానికిఁ గొంచెము వ్యాకరణము వచ్చు
నర్థంబు రసము మా టతని కేల ?
ఆతఁ డిక్కడ దోష మక్కడ దోషంబు
గ్రామ్య మీయది యలాక్షణిక మిద్ది
అన్యదేశ్యంబు లీ యవి శిష్టజనములు
పలుకుటకును భయంపడెడువారు

అంచు మమ్ముల్లనున్ నిరసించి వైచి
కొసకుఁ దోలును మము మాలగూడెమునకు
అంతమాత్రిన మా ప్రియు సుంత వీడ
మాతఁడుంగూడ మము వీడఁ డంతమాత్రి.

ఏ మల మాలగూడెమున
కేఁగిన బాఁపన యగ్రహారపున్
సీమకు నేఁగినన్ సమమె
నేమము తప్పినఁ దప్పకున్న నొం
డే మఱి మే మొగిన్ సుకవి
హృత్కమలంబుననుండి సృష్టి గొ
న్నామనుచో మహాజనుల
నాల్కకు భూషణ మాదు మెంతయున్.

వీణెయపైఁ జేయి వేయుము వాగ్దేవి
మా నైజ సంగీత మహిమ వించు
నలినాసనుని నాల్గు నగుమోము లెక్కఁ డె
క్కడ నంచు మాకు స్వాగత మొసంగు
మౌనివర్యులు మనో మందిరంబులయందు
నలరింతురు మాకు సింహాసనంబు
కవిరాజు లమృతంబు కడ గాఁగఁ బెట్టి మ
మ్మాదరింతురు భావమేదురముగ

మేము లేకున్న మూగలు మీరలెల్ల
మేము వచ్చిన వాక్పతుల్ మీరలెల్ల
మేము లేకుంట మీ చెవి మింటిగుంట
మేము కలమేని మీ చెవి మేజువాని.

## నాఁ గ టి చా లు

౧

నిను జగదీశ్వ రేశ్వరుని నెమ్మి నుపాసన మాచరింపఁగా
మనము త దేకతానమయి మన్నడ దానికి నంతరాయముల్
కనఁబడకుండ నుండుటకుఁగా నొగిఁ గోరిన డబ్బు నిచ్చి కొం
టిని నొకతోఁట నీ వలరు నిక్కపుఁగోటను నొక్కచోటునన్.

కాఁడి గట్టుల నుండు కర్షకు లొక రొక్క
    రే వచ్చి చూచి తా మిట్టు లనిరి
తోఁటన్నఁ దోఁటయా తొడలోఁతు గడ్డి యె
    సంగును బోదు వేసంగి నేని
ఈ మావి చెట్టుండెనే బండ్లకొలఁదిగాఁ
    గాయును గాసంతగాని లేదు
మాపు తుపాకిని మాఁటు పెట్టిన నేని
    నీమావి విడిచి పో దేదుఁబంది

అంతఁ దోఁటీఁడు ముందరి కరుగుదెంచి
'అయ్య ! యాగడ్డ మరునకుఁ దియ్యచెఱకు -
విండ్ల నిరు డిచ్చె' నని చెప్ప వింటి నొంటి
పనియుఁ బాటయు లేకున్న వాని పగిది.

ఆ నూతి నీరు పాలు మ
ఱీ నేలకుఁ జాలినట్టి దెంచును నీ ప్రాం
తానను లే దంచును దమ
పైన పొలంబులకుఁ బోయి రలవారెల్లన్.

౨

తోఁట యుత్తరమును దూర్పు దక్షిణమును
బశ్చిమ ప్రాంతంబు పాఱఁ జూచి
దిగుడు బావి నెసంగు తేట తీయని నీరు
కుత్తుక బంటిగాఁ గ్రోలి క్రోలి
కంచెకాల్దరి యేటికట్టపైఁ గల పూల
మొక్కల నొక కొన్ని పూలఁ గోసి
క్రొమ్మావి గున్నపైఁ గొమరారు నొకశాఖ
యాసనం బేయఁ గా నధివసించి

నెమ్మి నలవారి మాటల నెమరువేసి
ఇంత డబ్బిడి కొన్నా మీఁ కింతెనుండి
దీని వెల లాగఁగాఁ బోలదే? యటంచు
దలఁచితిని నాదు మానస తలమునందు.

కొనుటల్ సేద్యము పెట్టుకొంటకును నొక్కొక్కయైన నేమాయె నిం
దున తీర్పాటగు వేళలందుఁ జెఱకో దోసో తవిందో యరం
టినో పండింత మి దింత నంతటను నష్టిం గూర్చునో యంచు మా
విని వేగన్ దిగి వెళ్ళిపోయితిఁ దదావేశం బాగిన్ లోఁగొనన్.

## 3

దొడ్డమ్మ పేటలో దొరకెడుదానిలో
    విమలమా తియ తుంట విత్తనంబు
గంగలకుర్తిలో గాలించి గాలించి
    మోపు చేసిన పోఁక మోకగములు
పెదవడ్లపూఁడిలోఁ బేరు మోసినయట్టి
    తీయనారింజ బత్తాయి యంట్లు
కడియమ్ము నందున కల తోఁటలన్ని గ్రి
    మ్మఱిఁ గ్రిమ్మఱిను రోసి మావి యంట్లు

అల్ల పల్లవరంబున నరఁటి పిలక
సురవరమ్మున మొలకెత్తు చోడినారు
చిత్తవిత్తుగఁ గడఁగి వేసికొని వచ్చి
నాల్గు చోటులఁ దోఁటలో నాటినాఁడ.

రేయి యను సాగరంబున
నీయోడ మెఱుంగరాని ద్వీపంబునకుం
బోయి యట నాఁగి ప్రొద్దున-
నే యల యెడనుండి లంగరెత్తిన పిదపన్.

గుజ్జు మామిడి పొదరులోఁ గూరుచుండి
నియతి నీయోడ మరకాని నిన్నుఁ దలఁచి
యెవరో లో దూఱినంతటి యేపుఁ గాంచి
ముఖము సుఖ కిసలయితమై పోవలేచి.

వంచిన కొమ్మఁ బట్టుకొని
వైళమ లేచుచు నేల యెల్లెడం
గాంచుచుఁ దోఁట నెంతయును
గాచెడువానిఁ బిల్చి మోట తో
లించియుఁ బ్రాఁతమట్టి కదిలించియుఁ
బోయిన మొక్క లెంచి పాఁ
తించియు నీరువట్టు గుఱుతించియుఁ
గాలము నాకలించితిన్.

తోఁట సమస్తమున్ సరిగతోడుత
  నల్లిక యల్లినట్లు నా
నాఁటఁ బెరుంగుచుండఁగ
  ననంటుల మావుల నీడలందు ము
ప్పూఁటలఁ గూరుచుండి యెలబోంట్లకు
  గానము నేర్పుచుండ్రు లేఁ
దేఁటి యెలుం గెసంగ
  వనదేవత యుల్లము పల్లవింపఁగన్,

మారుఁడు సంజచీఁకటుల మాటున వేఁకపుఁ బోఁకపొత్తులం
జేరిచి క్రిందనుం బఱచి చేతికి వచ్చిన యన్ని వన్నె బం
గారు మెఱుంగులో చెఱకు కాముల నందుల మోపుగట్టి యీ
డేఱిన వారి నేఱి యలయింపను నోంపను దొంగిలించెడిన్.

కోమటిబిడ్డ లప్పు డొగిఁ గోటులు గోటులు గాఁగ వచ్చి యీ
భూమిని గుత్తగొందు మిడఁ బూనుదురే యని బేర మాడఁగా
'నేమిది! నేనె వీనినిఁ గ్రయించినచో నల లాభ మెల్ల నా
కే మిగులుం గదా' యనుచు నెంచుచు వారలఁ ద్రిప్పి పంపితిన్.

చెఱకు గానుగ లాడఁ గొఱముట్లు వక్కల
  వండఁగాఁ దగిన లోహండిఁ గొంటి
మావిపండులను నమ్మఁగఁ బెద్దపెద్ద బ
  స్తీల నంగళ్ళ నద్దెలకుఁ గొంటి

వచ్చు బండియుఁ బోవు బండియుఁ దిరిగెడు
పనిముట్లు కాఁగెడు పానకమ్ము
వండెడు పోఁకలు వచ్చెడు చోడి తఱి
వ్వెడు నుల్లి విత్తెడు విత్తనంబు

నై నిరంతర మాతోఁట యాసురముగఁ
గర్మదేవి కార్ఖానాగఁ గానిపించె
నప్పు డెల్లరు వచ్చి మే మనఁగ లేదె?
ధనము పొదుగును నీ నేల యనుచుఁ జనిరి.

అమ్మఁగఁ జేకూరిన రొ
క్కమ్మును లెక్కిడి యదెల్ల ఘటములలో భ
ద్రమ్ముగ నిడి యల భూగ
ర్తమ్ములలో వాని నెల్ల దాఁచితి నెలమిన్.

౯

మఱునటి యేటి తొల్దొలుత మాలి వనస్థలమందు ముందుగా
గుఱుముల నెల్లఁ జల్ల నెదఁ గోరియు దున్నుచు నుండు నంత నే
నఱవఱలైన మన్ను విరియంబడు కుంకుమవోలె లేవఁగా
వెఱగొని ముచ్చటంబడుచు వెళ్ళితి నాఁగటిచాలువెంబడిన్.

ఏ కా వ ళి

ఏమావి క్రిందఁ ద్రొలుతన్
నేమముతో నిలిచి నిన్ను నేఁ దలఁచితినో
యా మావి మొాక క్రిందటి
సీమల నాఁగేటి కఱ్ఱు చీల్చుచుఁ బోయెన్.

దాలఁ బటత్పట ధ్వనులు దారొ్కనఁ గట్టు తలంబెకాక గ
గ్గోలు పడంగ నాహృదయ కుండలి బ్రిల్లన బెల్లగిల్లఁగఁ
జీలుచుచున్ గమించె నొగి నిప్పుల కొండలు బ్రిద్దలొచు నా
చాలుననుండి లేచెఁ బరువదిృవ ధారలు కీల లొల్కఁగన్.

కొండొక వేళనుండి నెఱిఁ గోల్పడి చుట్టలు చుట్టుకొన్న నా
కుండలికిం బ్రిబోధ మొనఁగూడుదు నెంచుల కేను వచ్చి యిం
దుండితి! నేమి చేయఁగను యోజన చేసి మ తేమి చేసితిన్?
దండుగ తోఁట తా ధనరణ స్థలి గాఁగను మాఱిపోయెనా!

ఎంచఁగలేక యీ పయిరు నెల్లెడ నుండెడు నిన్ను గానుగా
డించితిఁ బిళ్ళచేతఁ బురుడించెడు పెన్ గొడవళ్ళచేతఁ గో
యించితి భూమిగర్భమున నెంతయు దాఁగిన వేళ్ళనెల్లఁ బీఁ
కించితి ధ్యానమున్ మఱచి కేవలముఁ ధనలోలుపుండనై

ఇటు లను కొంచును నతి వి
స్ఫుటముగ సకలంబు ముందు పొడచూపంగా
నెటనుండి బయలుదేరితి
నటనే యుండితి నటంచు ననుకొంటి నెదన్.

నా యాస్యం బది యెల్ల సాంద్రగతులా నాఁగేటి పెంజాళ్ళచే
గీయంగాఁ బడెఁ దోఁటమాలి నను లక్షింపంగ నిట్లంటి 'నీ
వాయూర్ద్రిక్త జవంబుకల్గు వృషభ ద్వంద్వంబు నిం కాఁపు! నా
కాయంబుం బగిలించి గుండియలనుం గజ్జుచ్చి పోయెం జుమీ!'

అన విని పాలే రొయ్యన
వెనుకకునుం దిరిగి దీని వెనుకలఁకున నుం
డినవాని కెట్లు తాఁకెడు
నని కాఁబోలును వితండ్రుఁడయి చనుచుండెన్.

నేర మొనర్చువాని నొగి నింద నొనర్చెడు రీతి తోఁపఁ 'బా
లేర! యిఁ కాఁపు మాఁపు మవలీలగఁ బాతెడు నెడ్ల గిట్టలం
జేరిన చప్పుడుల్ చెవులు చిల్లులు చేసెడుఁ గజ్జు నాగులం
దూరెడు' నన్న, వాఁడు వడితో భువి నొక్కొను నేఁడికోలనున్.

ఆరీతిన్ వెస నొక్కఁగాఁ బడుటచే నాయెడ్లు పిర్వేఁకుచే
మోరల్ పైకిని నెత్తి వె న్నొదుగఁగా ముంగాళ్ళపై లేచి ఘుం
టారావంబులు దిక్కులం బఱవఁగా నాకాశ సీమంబునం
జేరం బెత్తెడుమాడ్కిఁ గానఁబడియెన్ వీక్షించు నెవ్వారికిన్.

అంతట నే నిట్లంటిని
నింతటితో నెల్ల తోఁట కీపని తీఱెఁ
జెంతల నెడ్లేల? యిదా
నింతనసమయంబునంద నీవుం జనుమా.

అన విని యాతఁడు కొంచెము
యిన నర్థ మెఱుంగలేక 'యేమి యిది దొరా'!
యని బిట్టు వెఱఁగు పడి ని
ల్చెను దాఁ బ్రశ్నార్థకంపుఁ జిహ్న మనంగన్.

ఈ లలిఁ గాంచి యర్థ మది యెందుకు? నీ కలయొడ్లు నాఁగళుల్
నేలయు నెల్లఁ గావలయు నేని యొసంగితి; నొండె నెద్దులం
దోలుమి నేల బీడువడి దొడ్డలువోవుత మన్న నన్ను నా
వాలక మాచిచూచి యలవాఁడరిగెన్ వృషభంబు లూడ్చుచున్

౬

పారావారమునందు నొక్క మధురావర్తం బుదాత్తంబుగా
నారంభింపుడు నందుఁ దియ్యయల యొం డాకాశసీమాంతరా
పూరంబై యెద బీటి పట్టు లఖిలమ్మున్ ముంచి యివ్వాసనన్
దూరం బశ్రుతపూర్వమైన యెడకుం ద్రోసెం ద్వరాక్రాంతమై

మేరల్ మీఱి పెరింగిపోవు నల యూర్మిం గొట్టుకోపోయి త
ద్ధారా నీర మమైక యష్టినయి నిద్రా దేవి యంకంబునన్
వీరావేశము మధ్యమం దమృత నాభిన్ స్వచ్ఛమూర్ఛా మహా
గారంపున్ గుహయందు నెంతవఱకో కానిమ్ము నే నుండితిన్.

ఈయది కలదు తా నీయది లేదని
యనంగ శక్యము కాని దల్ల భూమి
ఈవల నావల నెల్లెడం గిరణ సం
చయము లంకూరించి లయము గాంచు
ఒక్క నావయునేని యుండంబోవని మహా
తేజ స్సముద్రింబు తేజరిల్లు
అమృత ప_త్తన విహారాగార తటములం
దట తట మని యది తాంచుచుండు

దానిచే నా మన స్సర స్తట యుగంబు
తుళ్ళి కూలెడి వేళలం దూముమోము
దాల్చి జాగ్రిదవస్థ తత్కాంతి వారి
ఒక్క చుక్కని దాన లేకుండం జేసె.

అంతం గన్నుల విచ్చి చూచితి నహో యానంద రాజ్యంబునన్
గంతుల్ వైచితి భూతసృష్టిబహిరాకారంబునుం గాంచుచున్
వింతల్ వోయితిం జేతు లెత్తి ఘురుగంభీరస్వరంబొప్ప మీ
రంతా రండిటు దేవదేవసుతులారా! యంచు ఘోషించితిన్.

దాఘిష్ఠంబై సాగిన
నా ఘోష యదొక్క శైల నాథోరు గుహా
శ్లాఘా పాత్రిం బగుటన్
మేఘమువలె నచటికే గమించితి వేగన్.

కోనల్ దేలిన గండ శైలములు ద్యోగోళాంత భాగంబుతో
మేనిం రాచెడు శృంగముల్ బలముచే మిన్నెత్తు వృక్షాగ్రముల్
గానంబుం బచరించి నెత్తములలోఁ గార్కొన్న పిట్టల్ నినుం
గానంగాఁ దల లెత్తె నయ్యెడల నేకంబైన భావంబునన్.

పరమ పవిత్రమైన యల పర్వత మందులఁ గూరుచుంటిఁ బైఁ
దిరుగుచు నుంటి నెంతయును దిగ్భ్రమఁ జెందుచు నుంటి నే ననం
తర మొకతృప్తి కొండొక ముదంబును బొందుచు నుంటి మింటిరా
సిరిఁ గనుచుంటి నుంటిఁ దొలిసృష్టిని దొల్తటి జీవి యట్టులన్.

అచటఁ గాకులుఁగూడ నలవోక మరణముల్
జననముల్ 'కావు కా' వనుచు నడచె
అచట నక్కలుఁగూడ నల కర్మకాండ తా
'నూల యూల' యటంచు నూలవెట్టె
అటఁ గుక్కలుంగూడ నతి మనోహర సుస్వ
రంబుగా సామగానం బొనర్చె
అటఁ దుమ్మిమొక్కయు నలరుగుత్తుల నలం
కృతిఁ జేసి నా కొక యిల్లు గట్టె

శాద్వలం బొందు నాకు నాసన మొసంగె
మంద మలయానిలంబు సమాధి గూర్చె
ఈశ నీకడ నుంటినా ? యింక నెంత
నడక ? చెప్పవె మనసు నూ నాదు పేరు.

# సత్యప్రతిజ్ఞ

కృష్ణరాయందు వెడలె దిగ్విజయమునకు
సాహితీ సమరాంగణ సార్వభౌముఁ
డతనికంటెను ముందు దిగంతములకుఁ
దద్యశోఘోటి వెడలె విస్తారధాటి.

జ్వాలలచే దవాగ్ని యతిసంయతమై మెలమెల్ల నేఁగెనో
కాలుఁడు కాలదండమును గట్టిగఁ జేతను బట్టి కొల్చెనో
శూలి తృతీయనేత్రమునఁ జూచెనొ నాఁగను కృష్ణరాట్చమూ
జాలము చన్నమార్గ మది చాలభయంకర మాయెఁ జూడ్కికిన్.

పాటల పీత ధూళి పట పంక్తులతోడ మహానక ధ్వని
స్ఫోటముతోడ భూరి రథ భూప పదాతులతోడ మేటి క
ర్ణాటుని ధాటి భూతలవియత్తల రంగములందు నా జగ
న్నాటక సూత్రధారుఁ డొక నాటక మాడునొకో యనందగెన్.

తలయెత్తు రిపుల వంచుచుఁ
దల వాల్చిన రిపులనెత్తి తద్వాహిని తా
జలజలఁ బాఱుచు నుండఁగ
నలనల్లన నుదయశిఖరి యడ్డంబాయెన్.

ఏకావళి

మదమున మీఱు నేనుఁగుల
మందలు పెన్నడగొండలం బలెం
బొదలఁగ దుర్గపాలకులు భూజములో
యన నిల్వ వజ్రి సా
హృదహ్లాద యుగ్రుఁడైన ప్రహరేశ్వర
పాత్రుఁ డనూదితార్కుఁ డ
య్యుదయ గిరీంద్ర దుర్గమున
నొప్పె క్షణక్షణ జృంభమాణుఁడై.

చిన్నయుఁ బెద్ద లేకొకరు చెప్పుట యొప్పుట లేక చన్నదిన్
మన్నది లేక రావుతులు మావతు లన్నది లేకొకళ్ళు, పై
కొన్న నొకళ్ళు పైకొనుటకున్ గమకించి ముహూర్త మాత్రలో
మిన్నును మన్ను నేకముగ మిత్తికిఁ బట్టొనరించె సైన్యముల్.

ఇభపతి పిన్నతండ్రి ప్రహరేశ్వర పాత్రుఁడు ధైర్యమేరు స
న్నిభుఁడగు కృష్ణరాయుఁడు ననికిని వెన్కను నిల్పి వీఁకమై
నుభయులు త్రోపులాడు రణమొప్పెఁ దిమింగిల తద్గిలంబులన్
గుభులు గుభుల్లటంచెదురు కొన్న సముద్రయుగంబు చాడ్పునన్.

వారణ కచ్ఛపముల పెను
పోరాటముకన్నఁ బెద్ద పోరాట మనన్
బాఱక చెదరక యాఁగక
హోరాహోరిగను బోరె నుభయ బలంబుల్

రుధిర నది మునకలాడి యాయుధ విఘట్ట-
నాతి మాత్ర ప్రభూతాగ్ని చేతఁ బట్టి
ఆజి దేవత తా సివాలాడె నపుడు
కోట మైసమ్మ తప్పెట కొట్టుచుండ

సరవిగ నిట్లు కొన్ని దివసంబులు పోఁ గటకంబు సైన్యముల్
తఱిమెను కృష్ణరాయలబలంబులఁ గ్రమ్మఱఁ గృష్ణరాట్చమూ
వరు లల శత్రులం దఱిమి వైచిరి సంగర దైవ మిట్టు ల
య్యిరువుర కంటిముందర జయేందిర నూయెల లూఁపె నేపునన్.

ఒకటా? రెండా? మూఁడా?
నికరముగా నెలలు పదునెనిమిది గతించెన్
వికటముగఁ గృష్ణరాయని
భ్రుకుటియు నధరంబు దంతములును జలించెన్.

ఇప్పటి దాఁక నింకఁ బ్రహరేశ్వరపాత్రుఁడు సక్కనుండెనా?
ముప్పదికోట్లదేవతలు ముగ్గురుమూర్తులు వచ్చి వేఁడినం
దప్పక నేఁడు వానితలఁ దన్నక నాతల కడ్గ నంచిటుల్
నిప్పులు గ్రక్కఁ గృష్ణధరణీవరుఁ డెల్లరుఁ దల్లడిల్లఁగన్.

కృష్ణరాయవిభుని కెమ్మోవి దాఁటెనో
దాఁటలేదో యీ దురిత ప్రతిజ్ఞ
వానివాని నోటఁ బడి ప్రహరేశ్వర
పాత్రుచెవుల వఱకుఁ బ్రాఁకిపోయె.

పరువెత్తు గుఱ్ఱంబు గొరిజలచే నేల
పటపట ధ్వనులతోఁ బగులువాఱ
ఉగ్రవేగంబుచే నుభయ దిక్కులయందు
నున్నవారెల్ల రుఱ్ఱూఁతలూఁగ
డాఁకేల వ్రేలు ఖడ్గము చాఁపు నాల్కలఁ
దేసఁ గాంతిధార నల్దెసలఁ బర్వ
అగ్ని గోళముఁ బోలు నక్షియుగ్మమునుండి
ధూమకేతువులు తోడ్తోడ రాలఁ

గానితతిఁ బుట్టుకొని వచ్చు కల్కిపోలె
నార సింహ కిశోరంబు వీరమూర్తి
గంధ దంతి ఘటా సమాక్రాంతమైన
యుదయగిరిపైకి లంఘించుచున్న వేళ.

ఎదురుగ వచ్చి యల్ల ప్రహారేశ్వర పాత్రుఁడు రత్న కందళా
స్పదమగు పైకిరీటమును జయ్యనఁ దీయుచు మాఱుమస్తకం
బిది యననేలమీఁద నిడి యొక్కటి నిల్చినయంత నేత్రముల్
చెదరఁగఁ గృష్ణ భూవిభుఁడు చిత్తరువై యొక యింతలోపలన్.

చేసిన ప్రతిజ్ఞ నిక్కమై చెల్లవలెనొ
యింత పంతంబు కల్లయై యేఁగవలెనొ
పట్టిన ప్రతిజ్ఞ ప్రహారేశపతియుఁ దాను
వ్యర్థ పడకుండవలెనొ యంచతఁడు వగచె.

తురగము మీఁదనుండి వడితో దిగినప్పుడు తూలినట్టులై
కరమును రత్ననేత్రములఁ గాంచు కిరీట శిరోగ్రభాగమం
దురవడి వామపాదమును నుంచి నిలంబడి హర్ష విస్మయా
దరములు మీఱఁగా నిటులుతా ననియెం బ్రహారేశపాత్రుతోన్.

'నా ప్రతిజ్ఞను జెల్లించినాఁడ వవల
నీవునుం జెక్కు చెదరక నిల్చినావు
నన్నునుం జాల విస్మయాపన్నుఁ జేసి
యోడితమును గెల్చినాఁడ వీ యుద్ధమందు.'

అంచును గృష్ణరాయవిభుఁ డా ప్రహారేశ్వరపాత్రు నిట్లు మ
న్నించి సమాదరంబునను నేలకు వంగి చిరత్న రత్న రుక్
నంచితమా కిరీటమును గైకొని యాతని మస్తకంబుపై
నుంచె జనించె నంతట మహోత్సవనాదము రెండు సేనలన్.

# ఉత్తరాయణము

ఎక్కడినుండి యెక్కడికి నేఁగుచు వ్రాలితి? విన్ని నాళ్లుగా
నక్కట దక్షిణాపథమునందు భ్రమించితి? తొల్లి నీదు గూఁ
డెక్కడ? నుత్తరాపథమిదే! యల సూర్యుఁడు తానె దివ్వెయై
చక్కఁగ దారిఁ జూపెడిని జల్లగఁ బొమ్మిఁక నోయి హంసమా!

క్రొత్తగ నిండె మానససరోవర మందుల నీడ సూచికొం
చిత్తఱినేని నీదయిన యింటిని గుర్తొనరించు కొమ్మ నీ
వత్తఱి వ్రాలు చక్రమున కాదియు నంతము లేదు పూర్ణమా
వృత్తము నుత్తరాయణమె విస్ఫుటముం బొనరించు హంసమా!

స్థావరరాజ్యమందు ఖనిజత్వమునుం గని యుద్భిదంబవై
సావిని మాఱి యంత నల జంగమ రాజ్యపు స్వేదజంబవై
పోవఁగఁ బోవ నీరచర భూచర ఖేచరతానుభూతి మ
న్నావిఁక నుత్తరాపథము నందుమ! రెక్కల సాఁచి హంసమా!

నేలయు గాలియుం జదలు నీళులు నిప్పులు పండువేళ ది
క్కాలము లొక్కటై కరఁగి గండరు వయ్యెడు వేళ బాడబ
జ్వాల మహాబ్ధి నష్టదళ పద్మముగాఁ జనువేళ నమ్మహా
కాలునిఁ జూచి యుత్తరముగాఁ జనుమా యిఁక రాజహంసమా

మూలలతోడ నిల్లలికి ముగ్గులు వెట్టుము! యింక మీనమే
పాలను లెక్కవెట్టకుము! జాగృతి శ్రేయము ప్రేయమన్న యీ
పాలును నీరముం గడు విభక్తతఁ జెందుచు దారిబత్తెమై
క్రాలఁగ నుత్తరంబుగ ముఖంబును బెట్టుము నేఁడు హంసమా!

పదునాల్గు భువనాల పడియచ్చు హరినాభి
కాసారమందు నీ కాఁపురంబు
పులుఁగుతత్తడి రౌతు బొడ్డు దామర తేనె-
వాఁగు నీ నోరూరు నోగిరంబు
విశ్వకర్మని నభో వీథికా గంధర్వ
వాటిక నీకు శృంగాటకంబు
ముక్కాఁకలం దీరు క్రొక్కాఱు మెఱుఁగు నీ
యిచ్చమై సాకతం బిచ్చువాఁడు

మానససరోవరము దాఁటి మబ్బు దాఁటి
యూర్ధ్వముగ మింటి కంటె నత్యూర్ధ్వముగను
ఎండ దోర వెల్లువ కరళ్ళ నెఱక లార్చి
హంసమా! యేఁగు మదె యుత్తరాయణంబు!

# గు లా బి

నే ను

పాదు చేసితిని నేఁడాది క్రిందటి మెత్త
        మట్టి పోసితిఁ జూచి మంచి దంటి
కాసారమున నుండి కావడితో నీరు
        తెచ్చి పోసితిఁ జూచి మెచ్చుకొంటి
నీకుఁ గావలసిన యాకలమ్ములు తెచ్చి
        యిచ్చితిఁ జాలు నం చెంచుకొంటి
నాయెత్తు పెఱిఁగిన నీ యొద్ద నిలుచుండి
        నారాణి వనుచు సంతసము గంటి

నిన్నుఁ గౌఁగిలి గొనియున్న నన్ను విచ్చు-
పూలతోఁ గాంచి యవలికిఁ బోవకుండఁ
గొమ్మ గోరులతోఁ బట్టుకొందు వకట
అంత యనుమానమా చెప్పుమా గులాబి!

ఎల్లకడల్ గుబుల్ కొనియు నేపగు తావుల నన్ను నల్లదే
మల్లిక పిల్చునంచు ననుమానము నా పయి? నీ విటుండఁగా
వెళ్ళను; లేక యొక్కపరి వెళ్లుదునంచనుకొమ్ము, దాని మ
త్తిల్లిన తావి నీకడకుఁ ద్రిప్పఁగ నెంతయొ నేపు పట్టునే?

నీకు నసత్య మెన్నఁడును నే వచియింపను జాది యల్లదే
నాకడ కొక్కసారి యయినన్ దయచేయుఁడటంచు నెంతయో
యాకులపాటుతోడ మరుదర్భకుఁ బంచును నేను నొక్క మా
టాకడ కేఁగ దాని రస మంతయు నంత మగున్ గులాబిరో!

ఒకటి నీకును నేఁ జెప్పకుండఁ జాల
నల్ల చంపకిఁ జూడ నేఁ బల్లవింతుఁ
గాని నీచేత నేను భృంగంబనైతి
నంచు నది దెప్పుచుండు నన్నప్పు డపుడు.

గు లా బి

చెలువుండా! యల మల్లి నీకు వలపుం
జెప్పింపు నాజాది నీ
కెలమిం గూర్చెడు చంపకిన్ మఱియు నిం
కెన్నెన్నియో యన్నిఁటిం
గలయంజూడుము; కాని నీ వవలికం
గాల్వెట్ట లోకుల్ కడున్
బలిముం జొన్పి గ్రహించుచున్ నఖములన్
బాధింతురి దంతంబులన్

నీతో నేమని చెప్పికొందుఁ బ్రియుఁడా!
నేఁజెల్ల! నొక్కండు నన్
మూర్తిన్ ముక్కును జొన్ని కొ్రిలు మఱియుం
గొండొక్కఁ డౌరా యెదన్
జేతం దాల్చును వేఱొకండును శిర
స్సీమంతమం దుంచుఁ ద
ర్వాతం జెప్పను నాదునోరు పడిన్
బాగుండి పోవుం బ్రభూ!.

నీ దారి కెందు నడ్డము
కాఁదలఁపను నాత్మహత్య కడుఁ బాతకమౌఁ
గాదా? నీ వావలికిం
బోఁదలఁచిన నన్ను జంపి పొమ్మొ సఖుఁడా!.

౨

నే ను

నిన్నే ? నేనే ? చంపుటె ?
కన్నావో లేదో యోపికగ నాదు మదిన్
కన్నెగులాబీ ! కాయం
బున్నది యున్నటులు చీల్చియును జూపింతున్.

ఇదె చీల్చితి లోలోపలఁ
బ్రిదరంబున నుండి కానవచ్చుం గనుమా
మదిరాక్షీ ! యింకను జే
సెదఁ జీలిక చూడు మిపుడు శీలించితివే ?

గు లా బి

ఇది యే మిచ్చట నేఁ బెరింగితి నహో
యెన్నని పుష్పాలతో
నదిరా చూచితిఁ జూచితిం బ్రియము నాథా
నే సనాథం గదా !
హృదయం బంచును నీకు నే నొసఁగ నేఁ డా
నేపారు ? నేనే భవ
ద్హృదయంబైతి క్షమింపవా ప్రియతమా !
యీ ప్రొద్దునన్ నన్నొగిన్.

నాదు పూవుల కన్న నన్నమును మృదువు
చెలువమై తగు నీ మేను చీల్చికొంటి
నాథ యింకను నన్ను సనాథగాఁగఁ
జేయుదువయేని నతుకుము చేతమునకు.

పాపాత్మున్ వల పెంత యుండుటకునుం బర్యాప్తియో యంతకున్
మోపౌ కొప్వల పూని నీ మెయికినిన్ మోసంబు గావించితిన్
నా పూ రేకలు నాదు జీవరసమున్ సంధించి యీ గాయమున్
లేపింపంగదవోయి ప్రాణసఖుఁడా! లెమ్మోయి నాకై వడిన్

## నేను

వల పింత యుండఁగా వలయు నంచును నొక్క-
కొలబద్ద యెందేని గలదె చెలియ?
ఒడలెఱుంగని సివ ముండుటే వలపున
కొక కొలబద్ద సుమ్మో గులాబి!
నీ సుమనో దళానీకమ్ము నిటు లిమ్ము
కూలార్చు గాయమ్ము కుట్టుకొందు
అందాఁక నీ తావి నడరించి నాదు నా
సా పుటమ్ముల నూఁదు మాఁపకుండ

పిదప నీవును నేనును ముదిమి లేక
లోక మించుక యెఱుఁగఁగాఁ బోక యొక
శయ్యయందుల నిర్నిమేషంబుగాఁగ
నొక్కటయి పోవుదము రమ్మిఁకో గులాబి!.

౧-౨-౧౨

# భా వ నా న ర్త కి

ఓ విశ్వనాథ ! జన తృ
ష్ణా వారిద ! నాదు భావనా న ర్తకి నీ
పావన పరిధిని భరత
ప్రావీణ్యము సూప నీవు పరికించితివే ?

ఇది యున్నది యున్నటు లే
యదనున వాఙ్మానదు కల్ల లాడెడు నని నా
యెదఁ దోఁచు నిద్ది చేసిన
యదె నృత్యము నీదు నెదుట నంతర్యామీ ?

ఇది నీ సన్నిధి నృత్యము
పదిం బదిగఁ జేసి చేసి వలయాకృతిగాఁ
బొదలెడు నెడ స్వేదము నీ
పదములపైఁ బడుట కెంతొ వగచెదిని బ్రిభూ !

నీ విద్దానిం దాఁకితి
కావలయును దీని మేనఁ గలుగు నలంకా
రావళి సకలమ్ము రస
ప్లావితమై కానఁబడు నపార్థివ మగుచున్.

పంచాంకంబుల నాటకంబయిన యీ బ్రహ్మాండమం దెంతయున్
సంచారంబును జేసి భావరసనా సంపత్తి నానందముం
గొంచున్ నృత్యముఁ గాక నర్తకుని, వాక్కుంగాక వక్తన్ సదా
గాంచన్ నృత్యము చేయుచుందు నని వక్కాణించు సర్వేశ్వరా!

# కుట్రి *

## [రామన్న ప్రోల మహారాజు ఆశ్రియము నొందుట]

‘శ్రీజాగ్రిన్నయనాంబుజా! యచల రాజీ తుంగ శృంగధ్వజా !
రాజద్రాజబిడౌజ ! కాకతి మహా రాజాధిరాజా ! మహా
తేజా ! భూరిభుజా ! సమస్త ధరణీ దేవోత్తమ స్వర్గ భూ
మీజా! మీకు జయంబు! మీకు శుభముల్ మీకెల్లకళ్యాణముల్

అంచుం బ్రోలమహీశు నోలగమునం దాశీర్వచించెం గడుం
గంచుం గీచిన యట్లు భూమిసురుఁడొక్కండు కుక్కనుం బోని మై
సంచున్ నించెడువాఁడు సిగ్గుచెలితో సావాసముంజేయు గో
రంచుం బంచియువాఁడు రామనసమాఖ్యాకుం డభీకుండొగిన్.

---

* ౧౯౧౦ సంవత్సరమున బుచ్చిరెడ్డిపాలెమున ఒక రెడ్డిగారు ఈ కథ చెప్పిరి. నాతో వినుచున్న అన్నదరపు రాఘవశాస్త్రిగారు నన్నుఁ జూచి ఈ కథను పద్యాకార మిమ్మనిరి. వెంటనే ఈ పద్యములు చెప్పితిని. జమీన్ రైతులో ఈ కథయే కొంతమార్పుతో ప్రకటింపఁబడినది. మా యిల్లును, దానితోపాటు చాలఁ బుస్తకములును, క్షయ సంవత్సరమున దగ్ధమయినవి. దగ్ధశేషములగు కాకితములలో అట నొక పద్యమును ఇట నొక పద్యమును ఉండఁగా నడుమ గొన్ని పద్యములు మరలఁ జెప్పితిని.

వానిభార్య వచ్చి వాని వెన్కఁ జనుంగు
ముసుఁగు రాణి వాసమున వసించె
వానికుఱ్ఱఁ డొకఁడు వారి మధ్యస్థలి
బొమ్మరిల్లుగాఁగఁ బొనరఁజేసె.

ప్రోలఁడు భూమీసురునకు
ఖేలగఁ దాఁ గేలు మొగ్గఁ గీలించుచు 'నిం
డోలగమునకును వచ్చితి
రేలా తమ' రనినఁ బాలుఁ డిట్టుల ననియెన్.

'తొలిజన్మమందు మీరలు లక్ష్మి నోమితి
రేము జ్యేష్ఠాదేవి నోమినాము
ప్రాగ్భవంబున మీరు వాగ్దేవి నోమితి
రేము నిద్రాదేవి నోమినాము
గత జన్మమున మీరు గౌరి నోమితి రేము
కాళరాత్రికిఁ గాళ్లు గడిగినాము
దేవతలను దొల్లి సేవించితిరి మీరు
దయ్యాల నెద మేము తలఁచినాము

మీకు మాకును భేదంబు లీకొలందు
లందులం జేసి మిముఁ జూడ నాఁడె మనసు
ఇట్టి యీతండు మీకు నే దేని పనికి
నించుచో వీని నుంచి పోషించుకొనుఁడు.

ఆపాటుఁ డిమ్మొయిన్ వా
గ్వ్యాపారము సేయ వించుఁ బ్రభు ‘వెట్లినన్
బాపఁడురా’ యనుకొంచును
‘నేపని చేయఁగల’ వనియె నెలుఁగెత్తి వెసన్.

శాంతిక పౌష్టిక సంస్కారములఁ జేయఁ
        బండితుండగు వసిష్ఠుండఁ గాను
కొడుకు కూరిమిచేత నడి దూరంబున యోగ
        పాండితి సూపు ద్రోణుండఁ గాను
నిదురఁ బోయినవారి నిస్త్రింశ ధారచేఁ
        దునిమెడు ద్రోణ పుత్రుండఁ గాను
కడుపు చెక్కలు గాఁగఁ గదలించి నవ్వింప
        గండండు నందికేశుండఁ గాను

ఇట్టి యీ పప్పురామన్న యేమి సేయుఁ
గాకతీశుండు ప్రోల భూకాంతు మ్రోలఁ ?
జాల మీ యుప్పు తినెడు విశ్వాస మెప్పు
డేమఱంబోవమియె యొండె యితఁడు నేర్చు.

అంచు వచియించు విప్రు వాక్యములు వించు
బ్రోలఁ డతనిఁ బరీక్షింపఁ బుద్ధిఁ దలఁచెఁ ;
గాకతియుఁ బ్రోలరాట్పరీక్షకును దలఁచెఁ
గాకతి మహాశక్తి గుడి నప్డు గంట మ్రోఁగె

ఓలగమువారి యందఱు
పోళైము లద్దానమోదపూర్ణము లాయెన్
'మేలయ్యా మే' లంచును
బ్రోలం డాశ్రియ మొసంగె భూమిసురునకున్.

౨

[యుద్ధమున కొమ్మన సేనాపతి పడియుటచే ప్రోలఁడు విస్తుపోవఁగా శత్రు వొకఁ డతనిపై కత్తిదూయుట. అపు డెవరికి తెలియకుండ రామన్న వచ్చి శత్రువును దునిమి పోవుట]

చాళుక్యావనిపాలు వంశమునకున్
సామంతుఁ డన్మాట ని
ర్మ్యాలంబుం బొనరించు చన్య విషయంబుల్
గెల్చుచున్ వైరులం
దాలుందప్పలఁ బోలెఁ జోపుచు
మహాత్రైలింగ రాజ్యంబు నల్
మూలల్ ప్రాకఁగఁ జేయుచుండె
బలిమిం బ్రోలం డహోరాత్రముల్.

పరిసరవర్తులైన పరిపాలకు లుత్కల కన్న డేశ్వరుల్
గురుతరసఖ్యముం బడసి కుట్రను బూని తెలుంగునాటి చి
ల్లరదొరమూఁక కింత ధనలాభము సూపి స్వపక్షు మెంతయుం
దిరముగఁ జేయుచుం దెలుఁగుదేశము ముట్టడివేసి రీసునన్.

క ౬౯

ఎక్కడఁ జూచినన్ సమరమే యెటు సూచిన రక్తపాతమే
యెక్కడఁ జూచినన్ శిబిరమే యెటు సూచిన నార్తనాదమే
యెక్కడఁ జూచినన్ సుభటులే యెటు సూచిన జీవహింసయే
యిక్కరణిన్ గతించె నొకయేఁడు తెలుంగు చెఱంగులందులన్.

ప్రోల మహా మహీశ్వరుని భూరితరాహవ పాటవంబునం
గూలిరి యుత్కలాన్వయులు గొందఱు గొందఱు కన్నడుల్ మహిం
గూలిరి కొందఱాంధ్రులును గుప్పనఁ గూరలు గాఁగఁ బోరిలోఁ
గూలిరి వారిచేతఁ దెలుగుం బొలిమేరల నాల్గు మేరలన్.

ఇమ్మెయి రెండుదేశముల యేలిక లొక్కటియై కలంచు యు
ద్ధమ్మునఁ బ్రోల ఱేఁడు తనదండను రెడ్డి మగం డొకండునుం
గమ్మవజీరొకండు నొక కాఁపుదునీఁడును గుట్ర బన్నఁగాఁ
గొమ్మనవాహినీ పతిని గోల్పడెఁ గోల్పులిబోని శూరునిన్.

వాఁడి మగం డిటుల్ పుడమి వ్రాలఁగఁ బ్రోలమహీశుఁ డాకు ల
ల్లాడక యుండు రావివలె నల్లన నల్లన విస్తుపోయె నీ
పోడెము సూచి మిత్రుబలెఁ బొల్చెడు శత్రువొకండు వాఁడి క్రొ
వ్వేఁడి మెఱుంగు గుంపులను వీడ్కొను కత్తిని నెత్తె జేనిపై.

అయ్యెడఁ బ్రోలభూమివిభుఁ డత్తులఁ జీఁకటు లావరింపఁగాఁ
జయ్యన నేలఁ గూలె నలశాత్రవుఁ డాతనిమీఁద దూఁకఁగా
'నియ్యదకృత్య మియ్యది యకృత్య మకృత్య' మటంచునొయ్యనన్
గుయ్యిడ నాత్మబాంధవుఁ డొకొండును లేఁడొక క్రోసులోపలన్.

ప్రోలాధీశుని కంఠనాళముపయిన్ రూక్షాసి పాణాళియై
వ్రాలంబోయెడులోన గాలిగతిగా రామన్న వేవచ్చి డా
కేలం గత్తిని గత్తి దాల్చినకయిన్ గేల్ దాల్చు భూపాలు భూ
పాలుం గాచెడు సేనఁదున్మి తన తోత్రవం బోయె నజ్ఞాతుఁడై.

దవ్వుల నున్న సేన లవి దాపులకుం జనుదెంచి చూడఁగా
నెవ్వరు లేనిచోట స్మృతిహీనుఁడు తేఁ డిటులుండె నంతటం
జివ్వకుఁ బాపి శాత్రవుల నేత్రములం బడిపోవకుండఁగా
నవ్విభునిం బురంబునకు నల్లన జేర్చెను గొన్ని సైన్యముల్.

## 3

[మూఁడు శక్తులు తనను మ్రింగ వచ్చినట్లును కాకతి వాని నాఁపినట్లును ప్రోలనికి పీడకల వచ్చుట. మెలఁకువ కలుగఁగనే అఁడుగూయి వినఁబడుట, రామన్నను ప్రోలఁడు అపుడు పరీక్షించుట. అందులకు అతనిని ప్రోలఁడు అనుగమించుట]

చిటపటఁ జిన్కు సాగెఁ బెనుచీఁకటి బూతమువోలెఁ గ్రమ్మె ది
క్తటములనుండి గాలి విటతాటముగాఁ జెలరేఁగె వృక్షముల్
పటపట మంచుఁ గూలెఁ బరివారముతో నలపంచ భూతముల్
కటకట బొంది యొండొకటి కయ్యముసేయఁగ లేచెనొయ్యనన్.

అట్టి నడికి రేయి యందున బ్రోలందు
　　వీడకల నొకండు తోడుగొంచు
పాల వన్నె పట్టు పానుపుమీఁదను
　　గనులు దెఱచి చూచెఁ గరము బలిమి.

అంతఁ గ్రిమక్రిమంబునను నాతనికిన్ స్మృతివచ్చె స్వప్న వృత్తాంతమ దిట్లు : తన్నొగి భయంకరశక్తులు మూఁడు ద్రింగఁగాఁ బంతముఁ బట్టి వచ్చి పయిఁ బడ్డటు లంతటిలో ననంత విక్రాంతి పరీత కాంతి యగు కాకతి వానిని నాఁపినట్టులున్.

పిమ్మటఁ బ్రోలరాజునకు వింతగఁ దోఁచెను శత్రు వెవ్వఁడో కిమ్మనకుండఁ జంపుటయుఁ గీడు తొలంగఁగఁ జేసి తన్ను క్షేమమ్ముగఁ గోటపట్టునకు మార్చుటయుం బయి నిట్టి చెట్ట స్వప్నమ్మొద నావరించుటయుఁ బైఁ బ్రకృతి ప్రతభావభంగియున్.

అప్పుడు కూఁత వేటు దవులందులనుండి యొకాఁడుకూయి తానప్పృథివీశ శేఖరున కల్ల వినంబడ 'నక్క టక్కటా!
యిప్పుడి దేడనుండి జనియించెనొ? దీనివిధం బదేమియై
యొప్పునొ? యేమి చేయనగునో!' యని యాతఁడు మల్లడింగొనెన్.

ప్రోలని మానసంబునను భూసురుఁ డప్పుడు తోఁచెఁ దోఁచినన్
లీలఁగ లేచి బంటులను లేపి మహీసురుఁ బిల్వఁ బంపఁగా
వైళమ వారు పోయి ద్విజవర్యుని గేహము తల్పుగొట్టఁగా
'నేల' యటంచు విప్రుఁడనె నేలిక యాన వచించి రా భటుల్.

పాఱుఁడు మంచి దటంచును
వారల వెనువెంట రాజభవనపు సింహ
ద్వారంబు సొచ్చి ఱేనిని
జేరం జన నిట్టు లనియె క్షితిపతి వడిగన్.

అయ్యా! మీ వలనం బ్రయోజనము మా కావంతయే నింతవ
ట్టయ్యున్నట్టులు లేదుగాని యిపు డేలా తత్ప్రసంగంబు లా
కుయ్యాలించితిరే యఁదెవ్వరిదో నాకుం జూడ మీవల్ల సా
హాయ్యం బేర్పడునంచుఁ దోఁచుడును మీకై పంపితిన్ బంటులన్.

నావుడు భూదేవుఁడు కరు
ణావలయితమైన యార్త నాదము విని త
ద్రావ ద్రావిత హృదయో
ద్భావిత నాదమ్ము తోడఁ దా నిటు లనియెన్.

నా వలనం బ్రయోజన మనం దగు వస్తువు లేదుగాని నే
నీ విషయం బొనర్పఁ దమకెట్టి ప్రయోజన మబ్బు? నైననుఁ
దేవరవారి చిత్తమున దీనికిఁ బ్రాపును బ్రోపు నబ్బెడుం
గావున నేను వోయి విధిగా నిది నిర్వహణం బొనర్చెదన్.

అంచు విప్రుండు కందుక మట్టు వోలె
సౌధ సోపాన జాలంబు చయ్య జాఱి
వేఁగి తూనీఁగ వోలె నయ్యిరుల బయలఁ
గాఱు కాటుక చందానఁ గలసి పోయె.

భూసురుఁ డేఁగి సంతటను భూధవుఁ డిట్టుల లోఁ దలంచె నీ
భూసురుఁ డేఁగునో ప్రళయ భూరిభయంకర మైన రేయి సం
త్రాసము చెంది యింటికిని దాఁజని పండునో లేక బల్మి నా
క్రోసమె పోయి గుండె చెడి కోల్పడి పోవునో జాతిభీతిచే.

అం చిట్టుల పోరిలఁడు లో
నెంచుచు నయ్యాఁడుఁ గూయి యెటు వుట్టెనో యా
పంచకు నొక్కఁడె హేతిస
మంచితుఁడై యేఁగె ధైర్య మది తోడు సనన్.

౪

[పోరిలఁడు, ధ్వనినిబట్టి కౌకతిగుడికి వెళ్ళి పొంచుండి వినుట. అటనున్న యామె 'నేను కౌకతిని. మూఁడు శక్తులు మీరాజును తినఁబోగా నేను బతిమాలుకొంటిని, అవి ఒక బాలుని తల్లి దండ్రిలతో బలిగోరెను, అందులకు నే నేడ్చుచుంటిని. నీ వార్తువా తీర్తువా పోవయ్యా' అని అనఁగా 'ఇంతే కదా నేను తీర్తు'నని రామన్న ఇంటి కేఁగుట.]

ఆకస ముగ్రమై యఱచిన ట్లశనుల్ పడి చప్పుడాయె భూ
లోకము పీఁకమై నరక లోకముదాఁకను గుంగి పోవునో
కాక యిదేమి యన్నటులు కంపము సాగె మహాసమీరముల్
పైకొని రేఁగి శైలముల పాఁతు లగల్చుచుఁ బోయె దివ్వెనన్.

పోలఁడు లేచుచుం బడుచుఁ బోవుచుఁ గాకతి దేవళాన నొం
డోలము నందు నుండి కనె నుగ్మలి నోర్తుక నేడ్చుదాని నా
భీల తరాకృతిం గడు గభీరను, నాపెకు ముందు విప్రునిన్
జాల దయార్ద్రమానసు విశాల ముఖాంచితు భూరి సాహసున్.

ఆర్తి పరీతయై మిగుల నార్చుచు
        నుగ్మలి విప్రుఁ గాంచి నీ
వార్తవో తీర్థవో ద్విజుఁడవయ్యును
        వచ్చితి, భీతి కెంతయుఁ
మూర్తులుగారె మీరు ద్విజ
        ముఖ్యులు పొమ్మికఁ బొమ్ము పోవయా
కర్తవు గావు నా వెతకుఁ గారణముం
        బొలియింపనం చనెన్.

పాఱుఁడు నవ్వి సంయతరవంబున 'నమ్మరో ! లేని భీసమా
చారము నాదుముందరను జాటకు, చెప్పుము నీదు భీతికిం
గారణ మెట్టిదైన నది కాఁగను వచ్చును నేను దానినిఁ
వారణ సేయవచ్చు' ననిపట్టును బట్టిన నామె యిట్లనెఁ.

నే నెవ్వతె ననుకొంటివొ
కానీ నేఁ గాకతిని వికారముఁ గనఁబో
కీ నుడి విను పయి నాదగు
నానను జేయం గలాడవా ? రామన్నా !

ఇంతి యిటు పల్కినంతట
'నింతే కద యమ్మ! దీని కింత భయంబా?
పంతము వేసి యొనర్చెద
వంతన్ వచియింపు' మనినఁ బడఁతుక యనియెన్.

వ్యక్తులు మాత్రమె కా కల
శక్తులునుం గూర్చి బన్ను సన్నాహముతో
యుక్తములై యున్నవి శ్రీ
సూక్తములం బోవు మిఱింగ నున్నవి తేనిన్.

ఇక్కడనే వసించు చమడేశ్వరి మాహూరి యేకవీరియున్
మెక్కఁగఁబోయి రీ నృపుని నే నది గాంచుచు నంత నమ్మరో
యక్కరో యంచు వేఁడ విని యవ్వాక బిడ్డని దల్లిఁదండ్రినిన్
జక్కఁగ మూఁగురన్ బలి నొసంగు మటం చని పోయె నిద్దెసన్.

అంచు నా కాంత పల్కినయంత విప్రుఁ
డింతయేకద యనుకొంటి నేమొ యంచు
నేను నా యాలు కొడుకును నిందు వత్తు
మిపుడె యంచును మఱలెఁ దా నింటి దెసకు.

ఈ మాటలు వినుచుండిన
భూమీశ్వరు మేన నెల్లఁ బులక లడరె నిం
కేమి విచిత్రము జతపడు
నో మఱి చూతమని యాతఁ డొదిఁగియె యుండెన్.

౫

[రామన్న ఆలుబిడ్డలతోఁ గాకతికడకు వచ్చుట. కాకతి వారిని బలి యిచ్చుటకుఁ గొనిపోవుట. పోలిఁడు వెళ్ళులోపల నే వారినిఁ జంపుశబ్దము వినఁబడుట. అతఁడు దుఃఖించి మెడను కత్తితో నఱకికొనఁబోవుట. దేవి ప్రత్యక్షమై వరము వేఁడుమనుట. పోలిఁడు రామన్నను అతని యాలు బిడ్డలను ఇమ్మనుట. ఆమె యిత్తు ననుట.]

ఆకులపాటు లేక తటి యాఱడి వుచ్చక నీఁట దోఁగి గం
ధాకలనం బొనర్చి పసుపంచుల తెల్లని పట్టుఁబుట్టముల్
స్వీకృతి సేసి విందు గొను చెల్వునఁ దల్లియుఁ దండ్రి బిడ్డఁడున్
గాకతి దేవళంబునకుఁ గ్రచ్చఱ వచ్చిరి భక్తియుక్తులై.

వచ్చిన వారిఁ గాంచి యల వామవిలోచన మంటకంటితో
వ్రచ్చెడు కత్తితో మెఱులు వర్ణముతో నల కాకతమ్మయై
మెచ్చితి మీరు రాకకును మీకు భయం బెనఁ గల్గినన్ మిముం
బుచ్చెద నింక శక్తు లవి పోలనృపాలునె మ్రింగుఁగా కనెన్.

కాకతిశక్తి యిట్టు లనఁగా నల మువ్వురు నేక కంఠులై
మాకు భయంబు లే దనిరి మంత్రము సెప్పను శక్తి వారలం
గైకొనిపోమెఁ బోలిఁడును గ్రచ్చఱ వెంబడి పోవుచుండె య
ప్రాకృతమైన శబ్దములు వానికిని విననాయె మూఁడొగిన్.

‘అక్కట! ముందిఁ కేమి విషయంబులు కన్పడునో యటంచిటుల్
నక్కితి నీ కుటుంబమును నాశము సేసితి నేను పోరిలో
స్రుక్కటకంబె నా జనని సూరెలఁ జచ్చుట మేలుకాదె?’ యం
చుక్కున హేతితోడ మెడనొయ్యనఁ గొట్టుకొనెఁ నృపుండొగిన్.

తగిలిన హేతి వెంటనె ముదంపడినట్టులు పూలమాలయై
జగదధినాథు నెమ్మెడ నెసంగఁగ దానికి విస్మితాత్ముఁడై
సొగసె నృపుండు ముందు పొడచూపుచుఁ గాకతి కోరుకో వరం
బిఁక ననె జేఁడు మూవురను నిమ్మనెఁ గాకతి యిత్తుఁ బొమ్మనెన్

ఇటు పల్కుచుఁ బల్కుచుఁ దా
నటు లంతర్ధాన మొందె నా కాకతి, యు
త్కట భూతరూపమును నం
తట నంతర్ధాన మొందె ధరణీస్థలిలో.

## ౬

[ప్రోలఁడు సంతసించి రామన్నకు సేనాధిపత్య మిచ్చుట.]

అంతటఁ గొల్వులోన నుదయంబునఁ బాలునిఁ జూచి రాత్రివృ
త్తాంత మెఱుంగనట్లు వసుధాధిపుఁ డిట్లనె మీదు దర్శనం
బెంతొ శుభావహంబు తమ రేఁగిన కర్జము తీరెనొక్కొ? య
య్యంతి యెవర్తొకో? యటుల నేడ్వగ నేలొకొ? యేడనున్కియో?

ఓ నరపాల ! యోర్తు గుడి నున్నది యాబిడ నామరూపముల్
లేనిది బిడ్డ కాపద దలిర్పంగ నేడ్చెడు, నంతఁ దోడుగా
నే నటు వోవ మిం్రగికొని యెట్టులొ న న్నిటు వచ్చె నెంతయుం
బైని కథాప్రణాళికిఁ బ్రమాణము తా మని బ్రాహ్మణుం డనెన్.

పాఱుని సాహసంబునకు బల్మికి నమ్మిక కయ్యపారగం
భీరత కిచ్చ మెచ్చి పృథివీపతి 'బ్రాహ్మణ ! యామె బిడ్డకుఁ
జేరిన కీడు బాపుటకు నీవె సమర్థుఁడ వంచు నాతనిం
జేరువఁ జేర్చి చేసి యభిషేక మొసంగె బలాధిపత్యమున్.

ఈ పగిది తేఁడు ద్విజు సే
నాపతిగాఁ బడసి ముగురు నాథుల కూట
వ్యాపార మడఁగ శాత్రవ
భూపులు సెడ నాంధ్రరాజ్యమును వెలయించెన్.

# త ల నొ ప్పి

తలనొప్పికిఁ దా లోనయి
తలచుట్టుం గట్టు గట్టి ధరణీపుఁ డొక్కం
డిలు వెడలి యొక మహాత్ముని
కెలని కరిగె నతని మహిమ గీతులు వినుచున్.

ఇలలో భగవానుని కృప
కలిమిని నందఁగఁ గూడఁ గల్యాణమె ? యీ
తలకట్టిదేమి? యంచును
నల నరపతితిలకు నా మహాత్ముం డడిగెన్.

అల భగవానుని కృప నా
తలనే వ్రేలాడెఁ, జెడ్డ తలపోటున నా
తల వగులఁ జేసెఁ గటికకు
గలుగునె కృప యంచు ధరణికాంతుం డనియెన్.

తల నొచ్చునో ప్రతిదిన మి
ట్టులు మీఁ కని యోగి యడుగుడును ముమ్మాఱో
నలుమాఱో యేఁడాదికిఁ
దల నొచ్చు నటంచు ఱేఁడు తా బదులాడెన్.

ఓహో! తక్కిన మూఁడునూర్ల యఱువై యొండౌ దినంబుల్ శిరో
ద్రోహంబుం గలిగింపలేదు భగవంతుం డంచు నేమేని నీ
దేహంబందున గుర్తు లోకులకునుం దెల్లంబు గావింతువే
మోహం బేది వచింపుమం చల మహాత్ముం డిట్లనెం గ్రమ్మఱన్.

నలుమాఱో ముమ్మాఱో
తల నొచ్చినయంత దేవతాద్రోహంబుం
దలకట్టు మిషను జనులకుఁ
దెలియంగాఁ జాట వచ్చితివె నరదేవా!

౩౦-౯-౩౬

## ప్రసాధనము

సిద్ధ హస్త లైన చెలు లిర్వు రొక జాము
అల సుకేశి చెల్వ మయిన తలను
దువ్వి చెఱిపి మఱల దువ్వియు ముడిచియు
నొయ్య నొయ్య నేఁగి రొక్క రొకరు.

అలచెలి యంత దర్పణమునందు
నలంకృతమైన మేలి వే
షలిఁ గనులారఁ గాంచి యిది నా
చెలికానికి నింపుసొంపు తా
నలవడుపంగ నేర్చునొకో? యంచును
మందరమా స్వరంబుతోఁ
బలుకుచు నుండ నే వెనుకపట్టుల
నిల్చితి నల్లనల్లనన్.

నాదగు నీడ దర్పణమునం దిల
కించుచు మోము వంచి హీ
నాదర మార వేనలిని హస్తమునం
దిటియంగఁ బట్టి యా
పైదలి పైఁట పైపయికిఁ బర్వఁగఁ
జేయుచు నన్ను మెల్లఁగా
నేది చనంగ నెంచుదును నింగితమున్
గనిపట్టి నే నొగిన్.

బాలా! నీతల ముడిచిన
శైలీకవు లెవ్వరోయి? సారస్య మహో!
చాలుం జాలు నటంచును
వాలాయముగాఁగ విప్పివైచితి నంతన్.

కాంతా! నా మది కింపితం బగు నలంకారంబు సర్వంబు నే
శాంతం బే నొకరుండనే తెలియుదుం గా కన్య లావారు కా
సంతేనిం దెలియంగ నోపుదురె యం చల్లల్లనన్ మాటనన్
మంతిం జెప్పుచు మోముఁ గేశముల గుంఫంబందులన్ ముంచితిన్

అపుడు సంపూర్ణ చంద్రగ్రహణముఁ గంటి
శైవల విడంబితం బంబుజంబుఁ గంటి;
పైని వేనలి మెల్లఁగాఁ బాయఁజేసి
యొయ్యఁ గనుఁగొంటిఁ బూర్ణచంద్రోదయంబు.

అల చీఁకటి నాఁచుం దీ
వల నా నెమ్మోముచుట్టు వల గొంటిని నం
దుల ముసుకల నాడితి గం
ధిల మగు తెరలందు నాడితిని దోఁబూఁచుల్.

అంత నా సుకేశి యల్లన ననె నిట్లు:
ప్రేమదైవ మెంత పెద్ద పేద ?
ప్రేమదైవ మెంత పెను వింత సత్యంబు!
వలపు డెంద మెంత వాస్తవంబు!

౫-౧౦-౧౨

# ఆనందము

వద్దని కద్దటంచు నోడువంగల వాక్కఁది నాకు లేశమున్
వద్దు త్వ దిచ్ఛకున్ జయము పల్కఁద నేఁడిదె నీదు తేజులోఁ
నెద్దియొ యొక్కఁడో కిరణ మెక్కువగాఁ బడియుండెనేని నా
యుద్దము ఘట్టునం బగిలి యంకెల కందకపోయెదుం బ్రభూ!

నీ కిరణం బొకండు గొని నేఁడు నిగూఢములో ససూర్యముల్
లోకము లెల్లఁ గాంచఁ గడు లుబ్ధుఁడనై యటువోవ నేడ నా
లోకము లేటివార్తయిది? లోపలబైటను మధ్యలన్ మహా
లోక మదైక వార్ధియె వెలుంగుఁ గలం గొనినట్టి చందమై.

రేయీ! నీవనఁ బ్రేమ నాకధిక మీ రిక్కఁల్ ప్రయోగించు వా
చోయుక్తుల్ మది నే నెఱుంగుదు మహీశోకంబు మీరెంతయుం
బాయం జేయఁగఁ గల్గు వారనెడి యీ వాక్యంబు భావింపఁగాఁ
బ్రాయోవాదము మీకుపాయమును నే వాక్రుత్తు రం డిద్దెసన్.

ఓ మధు చక్రిమా! యెచటి యుత్స మిదెక్కడి పాదపాంతరం
బేమి మహాగ్రివేగ మిది యేమి పసారము నీదు తేనెచే
గీమునఁబొల్చు బంగరువు గిన్నెలు దొన్నెలు పొర్లిపోవు నా
యేమి? యకాలవర్షముగదే యిది! యియ్యెడ నేను నిల్తునే!

ఈ తేనె చుక్క యొక్కటి
మూతికి రాచి కొనుమో సముద్రుఁడ యేత
న్మాత్రములోపల నీవా
పాతాళము దాఁకఁ దియ్యఁబడఁ గలవు చుమీ !

౧౯-౯-౩౯

# కుట్మలము

బంగారునీరు తీసిన
శృంగార గృహంబువోలెఁ జెలఁగు గవుసెనన్
బొంగి సగపాలు మరల భు
జంగి యనఁగ నందుఁ జొఱఁగఁ జనెదే వీణా !

పంచబాణుని బాణముల్ పల్లవములు
గాంచి కూర్చుండి కో యని పంచమంబు
మూగియఁ జేయకె కోయిలా పోయె దేల?
కేలు జాఱంగ బెట్టూడు కోలవోలె.

కన్నులనున్ నృత్యంబున
మన్నించి కులాయములను మాఁటుపడెదరే
వన్నియ జక్కవలారా
అన్నన్నా తెరమఱుంగు లగు నటుల గతిన్.

తావిమాత్రము నాది దళములన్నియు నీవె
యను పారిజాతమ్మునైన నొల్లఁ
బాదుగుమాత్రము నాది మో మదంతయు నీదె
యను కామధేనువు నైన మేప
పండ్లుమాత్రము నావి నిండుఁజెట్టది నీదె
యను కల్పవృక్షంబు నైనఁ జేర
కాంతిమాత్రము నాది ఘనత యంతయు నీదె
యను నింద్రనీలంబునైన ముట్ట

నీవు ప్రిప్పు తెమ్ము నే నూఁక తెచ్చెద
నీవు మెల్ల నూఁదు మేను తిందు
నన్నరీతి కాదె యారసి చూడుమా
కుటిల కౌశలంబ కుట్మలంబ !

౪-౧-౨౨

# పాములవాఁడు

కప్పులకుప్పలై మెసవి కాయము చుట్టలు చుట్టి మంచుపెం
దుప్పర కుప్పతిప్పలుగఁ దోఁగెడు నిత్తతి మంపుపెంపు కై
గప్పఁగ నీవు కట్టు కనికట్టున బుట్టను నిద్రఁబోవు నీ
తిప్పులమారి కుండలిని దీయుమ పాములవాఁడ పై కిఁకన్.

ఇది గిదిగో నీ శిశువుల్
ముదమునఁ గాంచంగ వచ్చి మూఁగుచునున్నా
రదిరా తుమ్మెద లుదయము
మొదలున విరిదమ్మి చుట్టు మూఁగిన యట్టుల్.

ఔరా రజ్జువువోలెఁ బండుకొనె నీ వ్యాళంబు మోమెత్తఁగా
నారంభింపదు నీదు నాగసారకాయన్ గాలిఁ బూరింపుమా!
చేరంగాఁ జని వక్రచక్రములలోఁ జేతం దగం దట్టుమా!
సారస్యంబుగ దిగ్విమోహనముగా సంగీతముం బాడుమా!

సానందంబుగ మ్రోఁగుచుం దిరుగు నీ సన్నాయి విన్నంత గా
డ్వానం గొంచెము లేచెఁగాని యలగా డ్వా నాస యందుండి దా
నీ నాసంబడి పోవు దెంచె నటులే యీ నాసయం దుండి తా
నా నాసంబడి పోయె నిశ్చలతఁ దా నందంగఁబో దక్కటా!

ఊఁదు మూఁదుము మూఖవీణ యూఁచముట్టు
బుగ్గ లల బూరెలంబోలెఁ బొంగిపోవ
ఎత్తుమెత్తుము పడగను నెత్తుగాఁగఁ
బొందికగఁ బ్రొద్దుతిరుగుడు పూవువోలె.

ప్రాణపిపాసువైన యల పన్నగ మల్లన లేచియాడుచున్
గానము సందులన్ నినునె గాటుగొనన్ గమకించెనో ప్రభూ!
జానొక్కొ పాముతోఁడఁ జెరలాటము లేమిది మాకు నేలకో
పానలు? పాములందులనె పండెడు నీ కిది యొక్కలెక్కయే?

కుబుసంబు మెయినుండి కూలిపోవఁగ నాగ
    బెత్తంబు నీవు పై కెత్తుమయ్య
నీ నాగసారకాయ నింపినట్టులు దీని
    నెమ్మేని గాలితో నింపుమయ్య

ఏకావలి

దండంబువలె నిల్చియుండంగ నలయేదు
స్వరములు గాలించి పాడుమయ్యా
నీచూపుతో పాటు నెటి దీని చూపును
నీమీఁదనే యుంప నేర్పుమయ్యా

పాలు గీలును వలద యీపాఁపతేని
కిమ్ము కొంచెమ్ము నీ విరిదమ్మి తేనె
పిమ్మట ఫణామణి ప్రకాశమ్ముతోడ
నివ్వటిల్లుత మిది నడదివ్వెవోలె.

౧-౧-30

# చిత్త భిక్ష

వెన్నెల వలిపెంబు విదిలించుకొం చంత
రాకాశమునఁ జందురుఁ డవతరించె
తోడిమె నూతులుగూడఁ గడు నూర్చి పూదావి
గంపలతోఁ దెచ్చి గాలి పోసె
ఆశాకరంబుల నాకాశ మల భూమి
కాంతామణిని బిగ్గఁ గౌఁగిలించె
వనలక్ష్మి యల వసంతుని వేయి కనులతోఁ
బులుకు పులుక్కునఁ బొడిచి పొదివె

రిక్క లాకాశవనమున నక్కి నక్కి
పొరిది నభిసారికల జాడఁ జూడఁ దొడఁగె
నట్టియెడ నొక్కఁ డొక్క గేహంబుఁ జేరి
యంత భవతి భిక్షాం దేహీ యంచుఁ బల్కె.

రా॥

ఎవరును మా ర్పలుకమి నా
యువకుండగు భిక్షువర్యుఁ డొండొకమా ఱో
భవతీ! భిక్షం బిడు మని
శ్రవణానందముగఁ బల్కెఁ జవి సవ్వడితోఁ.

లోపలినుండి యంత నొక లోలవిలోచన యొక్కచేత నీ
రాపయి వేఱుచేత నొక యన్నపుగిన్నెయుఁ గొంచువచ్చి యో
తాపసి! పట్టుమం చనిన దవ్వుల నిట్లనె భిక్షుకుండు సా
ధ్వీ పదిమంది కిచ్చు నల బిచ్చము కా దిడు చిత్తభిక్షనుఁ.

అలవాని పల్కుల నవధరించిన యంతఁ
గల్కికి మొగ మెల్లఁ గన్ను లాయె
అలవాని నెమ్మోము నాచి చూచినయంత
ముగుద కొంచెముగ నెమ్మోము వంచె
అలవాఁడు నిలిచిన నిలుకడ కనుఁగొన్న
నిలువున నీరాయె నీరజాక్షి
అలవాని యాకార మారసినంతనే
కాంత నెమ్మది చంద్రకాంతమాయె

అతఁడు చిఱునవ్వు నవ్వినయంత నంత
ఓయరం బుదకంబు నొండొండ చిందె
కడియములు నందియలు రెండు కలిసి పోర
నాబిడ చరాలునన్ ముంద రడుగు వైచె.

వాకిట నిల్వఁగాఁబడినవాఁ డలవాకిట నస్తమించి న
ట్లై కనుపట్టకున్న నలయంగన యంగనసీమనుండి య
వ్యాకృతమా ప్రపంచ మన వర్తిలు నా యమునా వనంబు లో
లోక మొనర్చె నీశ్వరునిలో లయ మందు నమందదృష్టులన్.

ఎల్లలోకులకును విందు లిచ్చువాఁడు
నన్ను బిచ్చంబు నడుగఁగా నడచిరాఁగ
మాయ గ్రమ్మిన యట్టులు మఱచిపోతి
నన్నుఁ బాలింపవచ్చిన నాథుఁ డేఁడి ?

అంచా లతాంగి యమునో
దంచ ద్వన కుంజ పుంజ తరువరలతికా
సంచయము లేకతంబుగ
సంచార మొనర్చెఁ జంద్రసాక్షిగ వితగన్.

ఇక్కడ నే నుంటిని మఱి
యిక్కడ నే నుంటినంచు నెటో విన్నటులై
యక్కలికి పొదరు పొదరును
నిక్కయు నిక్కయును వెదకి యేకై పోయెన్.

తెల్లవారంగఁజొచ్చిన నెల్లచెలులు
వెదకికొనివచ్చి విసువుతో వేసరిలుచు
రాధికా రాధికా యింక రావె యంచుఁ
బొడవుగాఁ బిల్చి సాగిరి ప్రొద్దు పొడిచె.

అల్లన రాధ యల్లయమునాంబువులం గని నాథుఁ డం చొగిఁ
హల్లకశయ్యపై జడసమాధిని బొందె విశుద్ధ తన్మనో
హల్లక బంధురం బయిన యాతఁడు బిగ్గరగాఁగ 'ఆఁ' యటం
చెల్లరునన్ వినంబలికె నెంతయు రాధయెలుంగు భంగిగన్.

౧-౪-౧౩

# మో హ ము

## ౧

రాత్రికిని రాత్రికిని మధ్య రాతి వోలెఁ
బగలు సృజియించు బ్రహ్మ దుర్భాజనుండు
లోకముల కెల్ల మదనుఁడే యేకదైవ
మాదిదైవము కాకున్నయట్టు లయిన
నిమ్మహా విశ్వ మేరీతి నేఁగుదెంచు
కాముఁ డొకఁడే ప్రేమ కేకాంతగురువు
విషయసుఖములు గ్రోలెడు విశ్వమూర్తి
ధరణి నెల్లెడ మన్మథ తాండవంబె
ఉల్లము ల వెల్ల మన్మథు నుపవనంబు
లే వసంతము తొలకరు లిక్షుశరు వి
భూతులే యల్ల హేమంతములు ప్రసూన
బాణు బిగికౌఁగిలింత లీ వాఁకదిన్నె
లందు నతఁ డొంటరిగఁ బోవు నప్పు డపుడు.

౨

మదనుఁడా! యిందు రాదురా మాకు నిద్ర
గాలిచేఁ గ్రీలు శైల శృంగములయందు
వికసితాశోక వృక్ష వాటికలయందు
ప్రణయ కలహ కటాక్షోదరములయందు
అదయ విరహసమాలోల హృదయమందు
చలిత ధూర్త విపక్ష వక్షముల యందు
తోడఁ జైత్ర వసంత చంద్రులను గొంచు
మెత్తగాఁ బొన్ను వేయరా యత్తమిల్ల.

3

అల్ల ధనదుని నవనిధుల్ కొల్లగొందు
శుక మునీంద్రుని గుంభదాసునిఁ బొనర్తు
ప్రేమ నలకూబరునకు నెమ్మోముఁ జూపి
రంభ గుండియలందున రాయి వైతు.
ఇంద్రునకు మోముఁ జూపక యేడిపింతు
గాఢ వైరాగ్యమునకు శృంగార కావ్య
తతుల దైనందినంబును గృతుల నిత్తుఁ
బ్రవరుచేత వరూథినీ భాగ్యవతిని
వేడఁగాఁ జేసి నిచ్చలు విఫలపఱుతు

ఓ యనంగుఁడ నీకిదే కాయమిత్తు
మేలుకనుమోయి నాదు నెమ్మేనియందు.

౪

సిగ్గుల్ తగ్గులు వారి వీరి భయముల్ చేదస్తముల్ చాటుగా
నగ్గంబైన విలాసముల్ మఱియు నేమండీ యటం చెన్నికల్
పగ్గాలూఁ మఱి కక్కుఁ-కల్లైములునుం బంచాస్త్రి గురాఁని కీ
దృగ్గాఢేతర ముఖ్యసౌఖ్యములు మీ కెల్లప్డు లాభించుతఁ.

౧౧-౪-౧౩

# చీఁకటి - వెలుఁగు

## ౧

చీఁకటికిన్ వెలుంగునకుఁ జిన్నతనంబునఁ బెండ్లియాయె నా
చీఁకటి పెద్దదా పిదప నీ యిది యేమిటి? మాలకాకులున్
దాఁకఁగ నోఁచుకోఁదగని నల్ల నిదానను; దెల్లసామితో
నే కరణిం ద్రిపన్ విడిచి యే నొనరింతును గాఁపురం బిఁకన్.

అని సిగ్గున మ్రిగ్గుచు నా
తనినిం దన నల్ల తెరను దఱలించి కనుం
గొన మది నెంచెంగానీ
కనఁబడఁ డా పెండ్లికొడుకు కాసంతేనిన్.

చీఁకటి చింతలం జివికి చెల్లరె ప్రాయము చెల్లె నెన్నినా
ళ్ళీ కరణిం బ్రియుం బడయకేను వసించుట? నాదు సామినిన్
నా కనుదోయితోఁ గనుటె నాకు ఫలం బనుచున్ మహాగ్రహం
జేకొని చేసె నెవ్వరికిఁ జేయఁగఁబోలని నిద్ర నిష్ఠతోన్.

౨

పద్మరాగ ప్రభాపటలితోడుత బుధుం
    డాకాశగంగలో నవతరించె
వెన్నముద్దకు మిన్న వెలగకాయకుఁ జిన్న
    వినువీదిపై కెక్కె వేఁగు జుక్క
ఏకాండమై యున్న యేడు గుఱ్ఱాల తే
    ర్నొగలపైకి ననూరుఁ డెగసి దుమికె
చెలువొందె నుష కావి చీర చెఱంగు ప్రా
    యేటి పేరలలపై కెత్తికొంచు

ఎంతకాలమ్మునుండియో యెంచుచున్న
వెలుఁగు పొడతెంచి తూరుపు వీథియందు
విక్రమించి జగం బెల్ల నాక్రమించె
విశ్వపద్మంబు రేకులు వేయు విచ్చె.

చీఁకటికిన్ వెలుంగు జిగిచేగమెఱుంగు లోకం డొకండుగా
సోఁకినయంత వెల్లువలు సోఁకిన రేణువు లట్లు నీరముల్
సోఁకిన యుప్పుచందముగఁ జొప్పడి స్వావయవంబు లన్నియుఁ
స్వాకృతితోఁ గరంగునపు డయ్యది యిట్లను నవ్వెలుంగుతోన్.

“స్వామీ దేవర కేను దాసి నన హాస్యం బయ్యేడిం గావునన్
భూమీమండలమందు నెవ్వారికినిన్ బోధంబు గాకుండఁగా
నా మేనిన్ సకలంబు గల్పుకొనెదే నా సామి నీలో నోహో
యేమీ నీదయ కంతుపొంతు కలదే యీరేడు లోకంబులన్ ?

నా సిగ్గంతయుఁ బాయ నీ కరములన్ నన్నెత్తి నీదౌ రథ
ప్రాసంగాననో యెందో నీదు దయ నా ప్రాప్తంబు భద్రంబుగా
నాసీనం బొనరించి పట్టుకొనవే యయ్యారె నా యంగముల్
వాసిం బాసెడిఁ బట్టుతప్పెడిని దేవా సర్వలోకేశ్వరా! ”

౫-౧-౧౪

# ప్రశ్న

ఓ కవిరాజ! యెందులకు నోయ్యాఁ గవిత్వము చెప్పెదయ్యా! నీ
వాకునకుఁ శ్రమంబు గనిపట్టిన చందము కొంచె మేనియుఁ
మాకును దోఁపఁ బోదు —

# ఉత్తరము

మతిమంతుఁడ! దానికిఁ గారణంబుఁ
నీకును జెప్పునప్పుడును నేఁ గనబోను శ్రమంబు సుంతయున్.

వాయు వెందులకును వీచు వారి యేల
పాఱుఁ జందురుఁ డేల చెన్నారుఁ గాయు
ఈశ్వరుం డెందులకు నింత సృష్టి సేయు
మాయు రే సుంత శ్రమ మను మాట లేక!

సౌందర్య మొందు మతి యా
నందం బది రెండు వివిధ నర్తన కేళీ
చ్ఛందము భావము మూఁడివి
విందుగ నాచేతఁ గవిత వెలి కుబికించుఁ.

# ఏ కా వ ళి

అల కవిత్వము ముంద రా తరువాతనే
నియతంబు లగుఁ గాలి నీళ్ళు నాకు
అల కవిత్వము ముంద రా తరువాతనే
యన్నంబు నటువోలె నాలు నాకు
అల కవిత్వము ముంద రా తరువాతనే
వస్త్రం బలంకారవార్త నాకు
అల కవిత్వము ముంద రా తరువాతనే
శాస్త్రంబు తత్ప్రయోజనము నాకు
అల కవిత్వము ముందర యందుమీఁదఁ
గాకితంబును వ్రాసెడి కలము నాకు
అలకవిత్వము ముందర యందుమీఁద
నీవు నాయాయివారలు నేను నాకు.

౨-౧౨-౧౨

# నిష్కాసనము

మా గృహ సీమ లన్నియును మజ్జన శాలలు పానశాలలున్
రోగపు శాలలున్ మఱియు రొక్కపుశాలలు నింక దక్కఁజో
భోగపు శాలలే యిచటఁ బుట్టదు బెత్తెఁడు నేల యిందు నీ
కేగతి వచ్చు వచ్చినటు లేఁగుమ! ముందర నేఁగు మీశ్వరా

మీ యింటియందు నెమ్మియిఁ జోటు లేకుండఁ
గాక మీయూర నెక్కడనో యుందు
నందువా? యెంతటి మందూండ వింత మి
క్కుటమైన వెఱ్ఱి కక్కుఱితి యేల?
గ్రామమధ్యం బది కలుగదా యందువా!
కరణమ్ము గా రది కలుపు కొనిరి
గోష్ఠంబులం దుండఁ గోరుదువా? క్రొత్త
లేఁగ దూడకుఁ గూడ లేదు చోటు

బంజరెందేని జిక్కదా? ప్రభువు వినిన
చేతి కఱదండములు ముందు చిక్కఁగలవు
ఇంక నెందేని జూడుమా! యెంత వెఱ్ఱి
వేఁగు మేఁగుము నిలువకో యీశ్వరుండ!

పోని మ్మల్లదిగో విభంజిత శిలా పుంజంబు తత్సీమలో
నేనుండందగదా? యదా? మునుపొగిఁ నీవున్న జీర్ణాలయం
బే! నేఁటఁ వితయంచు దాని భువిఁద్రోయించియుంజిత్రశా
లానిర్మాణము చేయుచుంటి మది యేలా నీకుఁ బోపొమ్మికన్.

ఎక్కడ నేనియుఁ దావది
చిక్కక పోనిమ్ము నీదు చిత్తము లేదా?
యక్కడ నేను వసించెద
నక్కరణికి సమ్మతింపవా మనుజుండా?

పరిహాసం బదియేల? యందుల జనాభా లెస్స యవ్వారిసం
దఱనున్ బైటికిఁ దీయుచో జగతియుం దాఁజాలునే యందులన్
గిరులన్ దాఁటిన వస్తుపుంజము లెటుల్ నిండారెనో చూడవా
యిఱుకాటంబయి గాలి దూఱుటకు నే నిందేది సందీశ్వరా?

ననుఁ గట్టుకొన్నట్టి నాతి నల్ చెఱఁగులఁ
        జెఱఁగు లాడించుచుఁ దిరుగవలదొ?
కన్న కౌమారుండు కడు గ్రంథ సాంగుఁ డుం
        డండు కొండొకటఁ గూర్చుండ వలదొ?
అనుపదంబునయందు నరుదెంచు నెచ్చెలుల్
        నెమ్మిమై నట శయినింప వలదొ?
అది నీ కొసంగుచో నల్ల రహస్యముల్
        నమ్మి మెచ్చుటను నున్పంగ వీలు?

నిష్కాసనము

ఎంత కోరికఁ గోరితి వెంత యాశ ?
తనకు మాలిన ధర్మ మింతయును దగునె ?
నన్ను నా వారి నవల కో యన్న ! నెట్టి
కాఁపురం బుండఁ దలఁచితి కాదె యహహా !

కాని మ్మెటులో యొకట్టుల
నే నుండంగలను నెంత యిఱకట మది తా
నైనను దీని పరీక్షకు
నైనను నూఁ యనుమి యుందు నందున్ మర్త్యా!

నీకు నాశయె కన్నే మొ? కాకయున్న
నీఁగకాలికి నైనను నేది చోటు?
విషయముల నిండి మది యని విడిగఁ గలదె !
వడిగ వేంచేయు మెంత యీశ్వరుఁడ వైన

౧౦-౧-౧౩

# శిల్పి

రూపము నాదు రాజ్య మనురూపములై తగు తూలికల్ మషీ
లేపము కాకితంబు లమలీమసముల్ వసనంబు లెంతయున్
నా పరివారముల్ గత మనాగతముం౯ మఱి వర్తమానమున్
మా పని చూడు మంచును బ్రణామ మొనర్చును నాదుచేతికిన్.

వ్రాయుదు నాకాశంబును
వ్రాయంగాఁ గలను నేను వాయువును మఱి౯
వ్రాయుదు జీవరహస్యము
వ్రాయంగాఁ గలను నేను భగవాను నొగి౯.

తేనియతోడ మోవి వినుతింపఁగ వ్రాయుదు దావితోడ నె
మ్మేనిని గూర్చెద౯ బెళుకు మించులతోడను జూపు గీచెదన్
మానితరీతిఁ దేటలగు మాటలతోడుత మోము తీర్చెద౯
దీ నియమంబుతోడుత హృది౯ లిఖియింతు ననంత చింతలన్.

ఎవ్వరా యన్న వా రహో యీశ్వరునకు
లేదు రూపంబు, రూపంబు లే దటంచు
వరుస నా గీయు ఛాయాతపములయందుఁ
బొల్చుకొనుమయ్య యెల్ల రూపులకు రూపు.

వాఁకల నేర్పుగా వ్రాసి చూపఱచేత
బిందెల గముల ముంపింపనేర్తు
ఉద్యానముల గీచియును బూలఁ బండులఁ
గోయఁ బెం దమిఁ జెందఁజేయనేర్తు
అందంబు వ్రాసి మీ యందఱ కందోయి
చే దాని నద్దుకోఁ జేయనేర్తు
భగవంతుఁ జిత్రించి పరమనాస్తికు చేతఁ
దిన్నఁగాఁ జేతు లెత్తింపనేర్తు

నాదు గీటులు మాటాడు నాదు గోరు
వంకలో నెన్నియో నెలవంక లాడు
మాట లిఁక నేల నా చేతి మన్ను హొన్ను
నేను ముట్టిన రాయి వాణికిఁ దురాయి.

౪-౧-౨3.

# ఏ కో పా స న

దేవుఁ డొక్కఁడె యెందు కీ దేవులాట
మతము లొక్కటె యెందు కీ మదము మనకు
ఉన్న మతముల నన్నింటి సున్నఁ జేసి
ఒక్క దేవుని కొలుత మం చూహఁ జేసి.

ఉపనిషత్తులను దా నొక్క యార్యుఁడు తెల్ల
        పాల రాళ్లుగఁ జేసి పట్టి తెచ్చె
జెందవెస్తాఁ బారసీకుఁ డొక్కఁడు కాంతి
        మద్రత్నసమితిగా మార్చి తెచ్చె
అల ఖురానును దురుష్కాచార్యుఁ డమల మా
        ణిక్యంబులుగను బొందించి తెచ్చె
బైబిలు నొక క్రైస్తవప్రముఖుండు తాఁ
        బచ్చరాలుగఁ బొందుపఱిచి తెచ్చె

తక్కుఁగల దేశములవారు తమదు తమదు
గ్రంథములనెల్లఁ గెంపులు గాఁగ నద్ద
ములుగ రవ్వలు గాఁగను మోచి తెచ్చి
గుట్టబోయంగ నవి యొక్క కొండ యాయె.

నానారూపసమేతుఁడుర్ మఱియు నానానామధాముండు తా
నైనన్ నామము లేక రూపమును లేకా యేకదైవం బొగిన్
నానా రత్న శిలాకలాప మగు నా నవ్యాచలంబందు నా
సీనుం డాయెను సర్వమానవ మన స్సిద్ధాంత యోగ్యంబుగన్.

ధారుణియందుఁ గల్గిన మతంబుల లోపలి సారమైన యా
చారము లెల్ల నేకమగు చాలునఁ బోఁతను బోసి యమ్మహో
దారపుఁ గొండచుట్టు వలయాకృతిగాఁ దగు భాతి రాతి ర
స్తా రచియించి కొండకుఁ బ్రదక్షిణముం బొనరించి రెల్లరున్.

ఈశ్వరారాధనము గూడ నేకరీతి
వలయు నంచును నెల్లరు వాంఛఁ బొంది
'యెగురు చీశ్వరు ధ్యానించు టింతనుండి
యొప్పు' నంచును యోజించి రప్పు డెదల.

అందఱుగూడ నప్పగిది ధ్యానము నొప్పిరి కాని యింక నా
చందము నొప్పకున్న జనసంతతి యున్నెడ వారిగంతులుం
జిందులుఁ జూచి క్రొత్తులని చెప్పనో యొప్పని దిప్పకాయలం
చుం దలపోయునో మఱియుఁ జోద్యపు దయ్యములంచు నెంచునో

ఏపటినుండియు మొదలుగ
నాపరమేశ్వరుని నేకముగు గతిఁ గొలువం
బ్రాపనుచు నెల్ల ప్రజ యీ
లోపుగ లేకుండ నొక్కలోపం బేనిన్.

ఒక్కరూపముతోడ నుండఁగా నెదఁ గోరి
సిగలు లేకుండఁగాఁ జేసికొనిరి
పలుకు లాడఁగ నొక్క బాస లేకుంటచే
మాట లాడుటె ముందు మానుకొనిరి
ఒక్క వేసముతోడ నొప్పారి యుండఁగా
వలువలు దాల్చుటే వదలుకొనిరి
మతవిరోధముఁ దెల్పు మచ్చ లటంచును
దిలకంబు దిద్దుట దీసివైచి

రిట్టి రూపంబు వ్యవహార మిట్టి వేస
మిట్టి మోములతోడుత నెల్లవారు
గంతులను వైచుచును భగవంతుఁ గొలువఁ
జెల్లరే కొండచుట్టు సంసిద్ధులైరి.

౧-౧-౧౨.

# ప్రేమ

నేఁ బ్రేమించెద భాగ్యవంతుల మఱిన్ నిర్భాగ్యులన్ జోడుగా
నేఁ బ్రేమించెద నీతిమంతుల మఱిన్ నీతిశ్రద్ధాశూన్యులన్
నేఁ బ్రేమించెద భోగశాలుర మఱిన్ నిర్భోగులన్ జోగులన్
నేఁ బ్రేమించెదఁ గామదేవు మఱియు న్నిష్కాముఁ గామారినిన్

ప్రేమింతు నే మనోభిరతి నరుంధతీ
        రమణితో యౌవనారంభ రంభ
వలచెద నెడఁదలోఁ బ్రవరునిఁ గామినీ
        కూబరుం డగు నలకూబరునిని
అభిలషించెదను మధ్యమపాండవుని వాని
        యడుగు దాఁటి విరాటుకొడుకుఁ గుఱ్ఱ
కామింతు దివ్యమౌ కల్పవృక్షంబును
        జెత్తలో మొలుచు కసిందమొక్క

# ఏకావళి

ఏను నక్షత్రమును జ్యోతిరింగణంబు
దోమ నేనుఁగుఁ బ్రేమింతుఁ దోయజంబు
గడ్డిపూవును బ్రేమింతుఁ గాంచనంబు
నినుముఁ బ్రేమింతుఁ బ్రేమింతు నెనుము నావుం.

వలచెద నెండల నీడల
వలచెద నే రేఁబవళ్ళ వలతు నమావా
స్యలఁ బున్నమలన్ వలచెదఁ
గలికిని బూరుషుని దేశకాలంబులనున్.

ఆంధ్రదేశంబుఁ బ్రేమింతు నరవనాఁడు
చోళములు కేరళంబులు చుట్టివత్తు
కోసలంబులు మగధముల్ కొలువఁబోదు
వంగము కళింగ మన్నను వాంఛ నాకు.

ఆస్తికునకును నత్యంత నాస్తికునకు
స్వస్తి చెప్పెద మాలండు బ్రాహ్మణుండు
నాకు నంతవ్యు లణువును నగము నొకటె
బుద్ధిలో లోన భావింతు బుద్ధు బద్ధు.

౧-౭-౧౧.

# అగ్ని

'అగ్ని మీళే పురోహిత' మ్మనుచు నిన్ను
ఋక్కు నుతియింప దానినే బొక్కినావు
విధవ కెంతయు వందన విధి యొనర్ప
నాకుబలె వృద్ధి చెందు మన్నదట యగ్ని.

ఋగ్వేదమును భాష్యవృతి సమేతంబుగాఁ
గారించి కారించి కాల్చినావు
భాష్యయుక్తము యజుర్బ్రిహ్మంబు సర్వంబు
కాసంత లేకుండఁ గాల్చినావు
భాష్యయుక్తంబైన వ్యాకరణంబెల్ల
కాకితంబులతోడఁ గాల్చినావు
అష్టాదశ పురాణ శిష్టేతిహాసపఙ్
పంచకంబును నాహారించినావు

ఎల్ల సాహిత్య శాస్త్రంబు నేర్చినావు
ఆంధ్ర వాఙ్మయ మంతయు నార్చినావు
ఈవు తగులంగఁ బెట్టని దేది చెపుమ
అగ్ని దేవుండ నీకు జయంబు గాత !

పెంచితిఁ బెద్దచేసితిని బ్రీతియుతంబుగ రాణివాసమం
దుంచితి రాజయోగ్యకుసుమోపవనంబులు క్రుమ్మరిల్ల ని
ర్మించితి విస్మరించితిని మేదిని మింటిని నొక్కపెట్ట న
ర్పించితి నిన్ను నగ్గికిని బెన్ బలిగాఁ గవితాసరస్వతీ !

కాల్చితి విల్లు సర్వమును గాల్చితి పాత్రము లూఁచముట్టుగా
గాల్చితి వెల్లయున్ ధనము కాల్చితి వెల్లయు ధాన్యరాసులన్
గాల్చితి వున్న వెల్లయును కాల్చినఁ గాల్చితి కాక గ్రంథముల్
కాల్చిన నీకు నో జ్వలన ! కడ్పది నిండెనో కాలు నిండెనో !

కాలిన యింటిలోపలికిఁ గాలిని బెట్టిన తత్ క్షణంబునం
గాలిన కాకితంబు లవి కాలిని గేలిని జుట్టి యుక్కనన్
వ్రాలుచు నున్న వక్కట సరస్వతి! నేనిఁక నేమిసేయఁగాఁ
జాలెడి వాఁడ నీకు నిదె సంచయనంబు వినా కనారిలన్.

ఒకటియా రెండునా యింట నున్న దెల్ల
మంటలోపల మలమల మాఁడిపోవ
నేది పోయిన దనుచు నే నేడ్తునయ్య
అగ్గిరాముండ! గాలిగుడ్డా! మహాత్మ!

కట్టుకొ నొక చింపి బట్టయేనియు లేక
యటుపైకి నుత్తరీయంబు లేక
తినఁబోవఁగా నొక్కదినుసు గింజయు లేక
పడి యుండఁగాఁ బాడుపాక లేక
కూరుచుండఁగ నొక్క గోనె గుడ్డయు లేక
శయనింపఁబోవ మంచంబు లేక
వండుకో నొక యోటికుండయేనియు లేక
కరమున నొక చిల్లి గవ్వ లేక

చదువుకొనఁబోవ నొక్క పుస్తకము లేక
తలఁచుకొననేని యొక్క పద్యంబు లేక
నన్ను సన్యాసిగాఁ జేసినాఁడవయ్య
దీర్ఘదర్శివి నీ వగ్ని దేవ నిజము.

మిథిలానగరము మంటఁ
శిథిలము కా, నాఁడు యేమి చెడలేదను సు
ప్రథితుండగు జనకుని సత్
కథ లెంతయు మాకు నెఱుక కలిపెమఁగాత.

పుస్తక పరామర్శము

గురువులై యనధీత గూఢశాస్త్రార్థ ప్ర
పంచంబు నాకు బోధించినారు
మిత్రులై గుణదోష మిథున విమర్శనా
విషయంబు నాకుఁ జూపించినారు
సహపాఠులై సదా సత్కళాసముదాయ
మెంచి నాతోడఁ జింతించినారు
చెలియలై సద్భావ చిత్ర డోలికల నె
క్కించుచు నన్ను నూఁగించినారు

మిమ్ము నమ్మిన శిష్యుని మీదుమిత్రు
మీదు సహపాఠి మఱియును మీకుఁ బ్రీతు
నన్ను విడనాడి మంటలో నున్నవారె
పుస్తకములార విజ్ఞాన పుటములార!

ఋగ్వేదమా! యష్ట దిగ్వీథులను నన్నుఁ
గన నెంత యడలితో కాలునపుడు
వేదాంతమా! నన్ను వీక్షింప యోగదృ
ష్మతి నెంత పూనితో మాఁడునపుడు
వ్యాకృతీ! యల యఘ్నుగంతమా 'ధృశి' నెంత
వఱపితో నా కయి చరము వేళ
కవితాకుమారి నన్ గనుపొంచె నెన్ని ము
ఖాల దుఃఖించితో కాగు తఱిని

కట్ట సాహితిరో నన్నుఁ గౌఁగిలింప
ఎంత చేతులు జాఁపితో యే మనందు
నన్నుఁ గంకాళమును జేసి చన్నవారె
పుస్తకములార విజ్ఞానపుటములార !

[క్షయ వత్సరమున నాతప
ఖయమగు వైశాఖ కృష్ణపక్షంబున నూ
రయ దినమునన్ ద్వితీయో
దయమునఁ జిరివాడ యెల్ల దగ్ధం బాయెన్.]

30-3-౨౬.

